

ఏవియం

# బామ్మ మాట బంగారు బాట

రాజశేఖర్



జంధ్యాల వేటూరి

చంద్రబోస్

AVM PRODUCTIONS

M.శరవణన్ M.బాలసుబ్రమణియన్ M.S.గుహన్

సురేష్ మూవీస్

JAGATI Rs. 2-00 June 1989

34th Year of Publication

# జగతి

ఎడిటర్: చందూర్

జూన్ - 1989



భవిష్యత్తులో జాగ్రఫీ పాఠం చెప్పే పద్ధతి

—'సోవియట్ భూమి' సౌజన్యంతో

'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922,, మద్రాసు - 600 004
ఫోన్ : 76697. - చందా 2 సం॥లకు రు 45-00. - 5 సం॥లకు రు. 100-00. జీవిత చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం: కందుకూరి వీరేశలింగం

# నిమ్మతొనలు

నేను ఇవ్వాళ ఈ నాటకంలో ఒక ప్రముఖపాత్ర ధరిస్తున్నాను - అన్నాడు గోపి.

'హీరోవా ?' అని ప్రశ్నించాడు సుదర్శనం.

'కాదు'.

'విలన్‌వా ?'.

'అదీకాదు - పోస్ట్‌మాన్‌ని'

సుదర్శనం ఫక్కున నవ్వేసరికి గోపి సంజాయిషీ చెప్పాడు : 'తెర తీయగానే ఒక పోస్ట్‌మాన్ వచ్చి ఉత్తరం యిస్తాడు. మిగతా నాటకమంతా ఆ ఉత్తరంమీద ఆధారపడి నడుస్తుంది.'

— కె నాగేశ్వరరావు
నరసరావుపేట

కళ్ల డాక్టరు వద్దకు వచ్చిన రామనాథం అన్నాడు : 'నేను మూడు జతల స్పెక్టెక్స్ వాడుతున్నానండీ'

'మూడు జతలా ? దేనికి ?'

'ఒకటి దూరదృష్టికి ; రెండోది హ్రస్వ దృష్టికి - షార్ట్‌సైట్‌కీ, లాంగ్ సైట్‌కి. ఇక మూడోది ఆ రెండూ ఎక్కడ వున్నాయో వెతుక్కునేందుకు!'

— వెవి రమణ

ఈరోజు ఎలక్ట్రిసిటీ గురించి పాఠం చెబుతానన్నాను - మీకు కలిగే సందేహాలు తీరుస్తానన్నాను, క్లాసు యింత పల్చగా ఉన్నదేమిటి ? - అని వాపోయారు సైన్స్ మాస్టారు.

'ఎలక్ట్రిసిటీ అనగానే షాక్ కొడుతుందేమోనని భయపడి వుంటారు సార్' - అని చమత్కరించాడు గోవిందరావు.

— బి వెంకటేశ్వరరావు
రుద్రారం

నాటక రచయిత ఇబ్సన్ ఒకసారి రోమ్ వెళ్లాడు. అక్కడ ఒక వీధిలో గోడ కంటించిన ఎర్రని పోస్టర్ వద్ద చాలామంది గుమిగూడి వుండటం చూసి, పక్కన నిలబడ్డ పెద్దమనిషిని, 'కళ్లద్దాలు హోటల్ రూమ్‌లో మర్చిపోయాను - ఆ పోస్టర్లో వున్న విశేషమేమిటో కొంచెం చదివి చెప్పండి' - అని అడిగాడు ఇటాలియన్ భాషలో. ఆ పెద్దమనిషి ఇబ్సన్‌ని ఎగాదిగా చూసి 'మీకు మల్లేనే నాకూ అక్షరాలు చదవటం రాదు' - అన్నాడు.

— డి సత్యమూర్తి
వాడ్రేవుపల్లి

నాన్నా, మీ అల్లుడిగారి హృదయం వొట్టి బండరాయి - అని పిర్యాదు చేసింది సుమిత్ర, తన తండ్రితో.

'ఆ కోనసీమ కుర్రాడు వద్దే, తల్లి, - రాయలసీమ అబ్బాయిని చేసుకో మంటే విన్నావా ?'

—జి మాధవీరామ్
నందిగామ

ప్రియా, నువ్వు పొద్దుట యిడ్లీలోకి చేసిన పచ్చడి అద్భుతంగా ఉంది - అన్నాడు శ్యామలరావు.

'ఇవ్వాళ యిడ్లీలోకి పచ్చడి చెయ్య లేదే - కారప్పొడి వేసుకోమన్నాను కదా ?'

'మరి ఆ పెద్ద గిన్నెలోది చెట్నీ కాదా - కొత్త రకం చెట్నీ అనుకున్నాను - మాంఛి రుచిగా ఉంటే !'

'అది వేసుకు తిన్నారా ? రామ రామ - కాగితాలూ మెంతులు రుబ్బి చేటకి రాదామని అక్కడ పెడితే ....

— కె సువర్ణ
రాజమండ్రి-2

పాపా, మీ నాన్నగారి పేరేమిటి ?'' - అని అడిగింది కాన్వెంట్ మిస్, కొత్తగా యల్ కెజిలో చేరిన సుధని

'నాకు తెలుసు. మీ అమ్మగారు ఏమని పిలుస్తారు ?'

'నేను పిలిచినట్టు డాడీ అని పిలవదు.

'మరి ఏమని పిలుస్తుంది'

'హోయే - అంటుంది'

—ఆర్ కళ్యాణి
కాకినాడ-2

---

రచయిత కాదలుచుకున్న వాడు అరిస్టాటిల్ నలహా పాటించడం ఎంతైనా అవసరం - మేధావుల పద్ధతిలో ఆలోచించి, సామాన్యుల భాషలో చెప్పగల గాలి. —యాశ్చమ్

మనం చేస్తున్న ఫలానా పని 'తప్పు' అని తెలుసుకోవడం వల్ల కూడా ఎంతో ప్రయోజనం ఉంది. అనునిత్యం తన తప్పొప్పులు తెలుసుకుంటూ జీవన సరళని దిద్దుకొనే వ్యక్తే, మన కళ్ల ముందు మహాపురుషునిగా రూపొందు తున్నాడు. —కార్లయిల్







# పాఠకుల తీర్పు

చిర మిత్రులు శ్రేయోభిలాషులు చందూర్ దంపతులకు; నమస్కారములు. గత శనివారం 'వనిత' సంపాదకులు నర్సుగారు వచ్చి "జగతి చూడలేదా ?" అనడిగారు. ఇంకా మాకు రాలేదండి, రెండో టపాలో రావచ్చు' అన్నా. వెంటనే మేడమీద వారి రూమ్‌లోకివెళ్లి 'జగతి' కాపీ పంపించారు. అప్పుడు తెలిసింది, ఈ కలకలం ఏమిటా అని .... శ్రీమతి సరోజినీ ప్రేమ్‌చంద్‌గారు ఎంతో అభిమానంతో పొందికగా రాసిన వ్యాసమిది - వారికి కృతజ్ఞతాభినందనలు .... ఆనాడు సభకు హాజరై ఈ వ్యాసం చదివినవారు చక్కగా ఉన్నదన్నారు. ....మూడున్నర దశాబ్దాలు 'జగతి'ని ఇంత చక్కగా నిర్వహించుకు వస్తున్న మీసామర్థ్యం మెచ్చతగింది - పొగడ్త కాదు. ఇతరులకు సాధ్యం కాదు .... ఒకప్పుడు మీరు పరశువాక్కంలోని మూకతాల్ వీధిలోను, మేము వెంకటేశబరన్ వీధిలోను ఉండేవారం. ఒకరోజున మీ దంపతులు ఇరువురూ మార్కెట్‌లో అగపడ్డారు. 'ఏమిటి విశేషం? ఇద్దరూ కలిసి వచ్చారెందుకని ?' - అని ప్రశ్నించా. వెంటనే మాలతిగారు 'మావారికి కూరలు కొనడం నేర్పుతున్నా'నన్నారు. తెగ నవ్వుకున్నాం .... అలాగే ఒకసారి బొమ్మగారిని, సెంట్రల్ స్టేషను నుంచి మా అక్కగారితో తీసుకురావడం! కాఫీ తీసుకుంటేగాని వెళ్లడానికి వీల్లేదన్నారు ఆ రోజున మాలతిగారు. ఇవన్నీ సాంసారికపు గొడవలే అయినా, జీవితంలో మరువలేని మధుర స్మృతులు .... నేను రాసి ప్రకటించిన పుస్తకాలు సుమారు ముప్ఫయి. - ఇప్పుడు ఒక్కటీ చేతులో లేదు. మీ కుటుంబ క్షేమాదికాలు ఒక్క కార్డు వేస్తే, మే మిద్దరమూ సంతోషిస్తాం, మరి ఉందునా ....

—ముద్దా విశ్వనాథం
మద్రాసు-44

సంపాదకులకు : 'ప్రాచీన సాహితి' పరవశింప జేస్తోంది. ముఖ్యంగా 'డైరీ' పేజీలలోని రకరకాల అంశాలు మమల్ని విశేషంగా ఆకర్షిస్తున్నాయి. ధర పెంచి పేజీలు అధికము చేయ ప్రార్థన.

—సి నాగేశ్వరరావు
సికింద్రాబాదు-3

ఈ భూమండలంలోని కవితా వాహినికి యింకిపోవడమంటూ వుండదు; అవి నిరంతరం ప్రవహించే రసధార. —కీట్స్

# ప్రాచీ



అతనికి వార్ధి కుల్య యగు అగ్ని జలంబగు మేరుశైల మం
చిత శిల లీల నుండు మదసింహము జింక తెఱంగు దాల్చు గో
పిత ఫణి పూలదండ యగు భీష్మ విషంబు సుధారసంబగున్
క్షితి జనసమ్మతంబగు సుశీలమదెవ్వని యందు శోభిలున్

—భర్తృహరి

దేహ మున్నవఱకు మోహ సాగరమందు
   మునుగుచుందురు శుద్ధ మూఢజనులు
సలలి తైశ్వర్యముల్ శాశ్వతం బనుకొని
   షడ్భ్రమలను మానజాల రెవరు
సర్వకాలము మాయ సంసార బద్ధులై
   గురుని కారుణ్యంబు గోరు కొనరు
జ్ఞానశక్తి విరక్తులైన పెద్దల జూచి
   నింద జేయక తాము నిలువలేరు
   మత్తులైనట్టి దుర్జాతి మనుజులెల్ల
   నిన్ను గనలేరు మొదటికే నీరజాక్ష
   భూషణవికాస శ్రీధర్మ పురనివాస
   దుష్ట సంహార నరసింహ దురితదూర

—నరసింహశతకం

కరుణాసింధుడు సత్యసంధుడు జగత్కల్యాణ బంధుండు బం
ధుర సౌజన్యుడు లోకమాన్యుడు గుణస్తోమైక ధన్యుండు సా
గర గంభీరుడు మేరుధీరుడు శుభాకారుండు సంగ్రామ దు
ర్ధర దోర్ధాముడు వైరిభీముడు ననన్ రాముండు మించున్ మహిన్

—రఘునాధ రామాయణం

# పాతికేళ్లనాటి పిక్చర్

## పద్మశ్రీ వారి 'ప్రేమించిచూడు'

ఇద్దరు అబ్బాయిలూ, ఇద్దరు అమ్మాయిలూ ప్రేమ నిచ్చెన మెట్లు, మాటలూ పాటలూతో ఎక్కి, సగం నిచ్చెన మీద ఉండగా, నేల బారు నున్న ధూర్తులు తమని భయపెట్టినా బెదరక, ముందు చూపే తప్ప వెనక్కి, చూడదలుచుకో లేదంటూ, నిచ్చెన చివరి మెట్టు చేరుకుంటారు - అనగా పెళ్లి చేసుకుంటారు. ఆ ప్రేమ నిచ్చెన మెట్లే ప్రేమించి చూడటంలోని సప్త స్వరాలూ, నవీనతా వాస్తవికతాను! ఎటువంటి ప్రత్యేకతలేని అతిసామాన్య మైన యితివృత్తాన్ని సందర్భోచిత హాస్యంతో ఎంతో రమణీయంగా ప్రద ర్శించిన దర్శకులు పి పుల్లయ్య కృషి ప్రశంసనీయమైనది. 'పని కావాలోయ్ బుచ్చబ్బాయ్' అంటూ ఒక వానర మూకని పోగుజేసి, యజమానికి ఉద్యో గం యిచ్చేదాకానే గాని తీసివేయడం అతని తరం కాదంటాడు కథానాయ కుడు రంగారావు (నాగేశ్వరరావు). అంతే కాదు, తన వృత్తి నిర్వహణకు ప్రణయ వ్యాపారానికీ ఎటువంటి సంబంధం లేదంటాడు. అందుకని తను ఒక ధనవంతు లమ్మాయిని పెళ్లా డటం ద్వారా ఈ లోకంలోని అన్యా యాలన్నీ తుడిచి వేయగలననుకొనే అర్భనాకారి మన సత్వ మతనిది. ఈ స్వాప్నిక పేద పౌరునికి, 'లిమోజైన్' లో తిరిగే సంపన్న మిత్రుడు వుంటే గాని కథ నడవదు గనక ఒక శ్రీని వాసరావు (జగ్గయ్య)! ఈ శ్రీనివాస రావు గడ్డం తగిలింపుకు శ్రీనివాస భూపతి అయి, తనకు గల కోట్లు గురించి చిలవలూ పలవలుగా కథలు చెబుతూ, కేవలం లక్షలు మాత్రమే గల బుచ్చిబాబుని (రేలంగి) బులి పిస్తూవుంటాడు. కాంచనమాల, రత్న మాల అను యిరువురు సుందరీ మణులు, వరహాల రాజు అనే సుపుత్రుడూ గల ఈ బుచ్చిబాబు, శ్రీని వాస భూపతి తప్పిపోయిన కొడుకైన రంగారావుకి (అంతా నాటకం) రత్న మాల నిచ్చి వివాహం జరుపబోయే సమయానికి, భూపతి తండ్రి సుబ్బా రాయుడు (గుమ్మడి) రంగ ప్రవేశం గావించి, కొన్ని మెలికలువేసి, కొన్ని మెలికలు విప్పి బుచ్చిబాబు కూతురు కాంచన మాలని (కాంచన) తన కొడుక్కి చేసుకుంటాడు. ఆవిధంగా రెండు జంటలూ ప్రేమ పర్యవసాన మైన పెళ్లి పీటలు చేరుకుంటారు: ఇంత సునాయాసంగా మూడు పెళ్లిల్లో సినిమాల్లోనే జరుగుతాయి.

—యన్నార్ చందూర్ సమీక్ష

'జగతి' - జూన్ 1965

## డా॥ స్వామినాథన్

అయిదు సంవత్సరాలు మనిలా లోని అంతర్జాతీయ పరిశోధనా సంస్థ డైరెక్టరు జనరల్‌గా అందరి మన్న నలను పొంది, అంతర్జాతీయ శాస్త్ర వేత్తగా ప్రసిద్ధి చెందిన డా. యం. యస్. స్వామినాథన్ పదవీవిరమణ చేసి, స్వదేశానికి తిరిగివచ్చారు.... కోయం బత్తూరు వ్యవసాయ కళాశాలనుంచి వ్యవ సాయ శాస్త్రంలో మొదటి తరగతిలో పట్టా తీసుకుని, 1952 లో కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం నుంచి జన్యుశాస్త్రం Genetics లో డాక్టరేటు పొందారు. 1954లో ఢిల్లీలోని భారతీయ వ్యవ సాయ పరిశోధనాలయంలో శాస్త్రజ్ఞు నిగా చేరి, ఆ తరువాత 1966 నుంచి 1972 వరకు ఆ సంస్థ డైరెక్టరు జన రల్‌గా పనిచేశారు .... వ్యవసాయ రంగంలో డా. యం. యస్. స్వామి నాథన్ గురించి తెలియనివారు లేరు. సహృదయుడు. ఆయన శాస్త్రీయ విజ్ఞానం, నైపుణ్యత, మానవసేవ సంక ల్పనలను గుర్తించి, మూడు ఖండాల లోని 26 విశ్వవిద్యాలయాలు డాక్టరు స్వామినాథన్‌కు గౌరవ డాక్ట రేట్లును బహూకరించాయి. భారతదేశం లోని మూడు శాస్త్రీయ అకాడమీలలో, లండన్ రాయల్ సొసైటీ, అమెరికా, సోవియట్ రష్యాదేశాల శాస్త్రీయ అకా డమీలలో ఫెలోగా గుర్తించి ఆ ప్రభుత్వాలు గౌరవించాయి. రామన్ మాగ్సేసే అవార్డు, ఆల్బర్టు ఈన్‌స్టిన్, బోర్లాగ్ అవార్డు, జనరల్ ఫుడ్స్, వరల్డ్ ఫుడ్ బహుమతుల గ్రహీత. ఇంతకు ముందే పద్మశ్రీ, పద్మభూషణ్‌లను అందుకున్నారు. 1989 జనవరిలో పద్మవిభూషణ్ బిరుదునిచ్చి భారత ప్రభుత్వం సన్మానించింది. ప్రస్తుతం భారత ప్రకృతి, సహజ వనరుల సంస్థ అధ్యక్షులుగా, ప్రపంచ అడవిజంతువుల భద్రత సంస్థ ఉపాధ్యక్షులుగా ఉన్నారు. దేశంలోని వ్యవసాయ రంగంలో అన్ని ముఖ్య సదస్సులకు, కార్యక్రమాల రూపకల్పనలో సలహాలిచ్చి, వ్యవ సాయ ఉత్పత్తుల పురోగతికి తోడ్పడు తున్నారు.

—వ్యాసభాగం
'అన్నదాత'

## ప్రేక్షకులు

నేను 'కేప్టెన్ నాగార్జున' తీశాను. 'దసరాబుల్లోడు' కు కేప్టెన్ నాగార్జున చిత్రాలకీ మధ్య చాలా విజయవంత మయిన చిత్రాలు నిర్మించాను. దర్శ కత్వం వహించాను. 'కేప్టెన్ నాగార్జున' విషయంలో నా అంచనాలన్నీ బాగా

దెబ్బ తిన్నాయి. దానికి పూర్తిగా బాధ్యుణ్ణి నేనే! కారణం - నేనొక కథ అనుకున్నాను. ఇప్పుడొచ్చే చిత్రాల లాగా కాకుండా ఏదో కొత్తదనం కావాలని ప్రయత్నించాను. ఆ కథలో ఎంతో తెగించి ప్రేమించి జీవితాన్నే త్యాగం చెయ్యటానికి సిద్ధపడ్డ హీరో తన ప్రేమను సాధించాడు. పెళ్ళి చేసుకున్నాడు. ఆమె ఛాతీ మీద వున్న ఒక పుట్టు మచ్చ వాళ్ళ జీవితంలో శాశ్వతమైన మచ్చగా మారి జీవితం నరకమైంది. ఇది కొత్త 'థాట్' అని నేననుకున్నాను. ఒక స్త్రీ పుట్టుమచ్చతో ఇంత రాద్ధాంతం ఏమిటని ప్రేక్షకులు తల తిరిగిపోయేటట్టు తిప్పికొట్టారు. అంతే! చిత్రాలు నిర్మించేది ప్రేక్షకుల కోసం కనుక జయాపజయాలకు న్యాయ మూర్తులు ప్రేక్షకులే!

—విబి రాజేంద్రప్రసాద్
'విజయచిత్ర'లో

## శతకం

ఆంధ్ర సాహిత్యమున శతకమొక విశిష్ట ప్రక్రియ. ఇది సంస్కృత, ప్రాకృత, కన్నడ వాఙ్మయ ప్రక్రియకు ప్రతిబింబమై, కొన్ని విశిష్ట లక్షణము లను సంతరించుకొని, తెలుగుకవుల స్వోపజ్ఞజనితమైన స్వతంత్ర కావ్యమ న్నట్లుగా స్థిరపడిపోయింది. తనకు గల విశిష్ట గుణములచేత సాహిత్యమున ఒక ప్రత్యేక స్థానమును సంపాదించు కొన్నది. తెలుగు సంస్కృతీ దర్పణం గా, తెలుగు సరస్వతీ మణికిరీటంగా నిలచి, దేశిప్రక్రియగా శతకం పండిత పామరులందరినీ సమంగా అలరిస్తు న్నది. తెలుగులో శతకాలు పరశ్శ తాలు. ఇవి ఆత్మాశ్రయ కవితా ప్రధానాలై, వివిధ వస్తుకాలై, భక్తి శృంగార వైరాగ్యనీతి హాస్యాధిక్షేపాది భావబంధురాలై, రసమహితాలై సమ కాలీన సమాజ స్వరూప దర్శకాలై భాసి స్తున్నాయి. శతకం వలెనే యక్షగానం కూడ ఆంధ్రప్రత్యేకత సాహితీక్షేత్రాన గడించుకొన్న మరొక సాహిత్య ప్రక్రియ. ఇది సంగీత సాహిత్య సమా హార కళారూపం. యక్షగానంలో భావా శ్రయమైన ప్రౌఢ సాహితీ రీతులు, మనోరంజకమైన ఛందో వైవిధ్యం. రాగ తాళయుతములైన గీతాదులు, లయాన్వితమైన గద్యం అన్నిటికీ అవ కాశం లభించింది.

—ఎ. భాష్యాచార్య
'స్రవంతి'లో



కొన్ని జలచరాలు గాక, నేల మీద నివసించే ప్రాణులలో నరునిదే అధిక ఆయుర్దాయం. తనకంటె తన వంశం గొప్పదిగా భావించడమే నాగ రికతకు పునాది. అందుకనే 'వంశ వృక్షం' అన్నారు. కాలిఫోర్నియాలోని 'మెతుసెలాస్' వృక్షాల వయస్సు నాలుగువేల ఆరువందల సంవత్సరాలు.

* * *

మీరు ధరించే దుస్తులు పురుషునికి నిండుతన మిస్తాయి; స్త్రీలో నిండు తనాన్ని చూపెడతాయి.

—లూయీహిర్ష్

# మానవ ప్రగతి

## భారత రైల్వేలు

పెరంబూరు కర్మాగారాన్ని 1955 అక్టోబర్ 2వ తేదీన పండిత నెహ్రూ ప్రారంభించారు. అనేక డిజైన్లల్లో ఉక్కు రైలుపెట్టెలను నిర్మించటం ప్రారంభమయింది. రెండవ తరగతి స్లీపర్ పెట్టెలు, ఏర్‌కండిషన్డ్ పెట్టెలు ఈనాటి రైల్వేల వేగాన్ని దూరాన్ని దృష్టిలో ఉంచుకొని ప్రయాణీకులకు ఎంతో సౌకర్యకరముగా ఉండేలా నిర్మింప బడుతున్నాయి. స్వాతంత్ర్యానికి ముందు దూర ప్రయాణీకులు అనుభవించిన అసౌకర్యము ఈనాటి మన రైల్వే ప్రయాణీకులకు వెతికి చూచినా కనిపించదు. పైగా ముందుగా రిజర్వేషను చేయించుకొని, ఆనందంగా నిద్రాసౌఖ్యాన్ని అనుభవిస్తూ ప్రయాణీకుడు ఈనాడు తన గమ్యాన్ని చేరవచ్చు. ప్రస్తుతము భారతీయ రైలుపెట్టెల కర్మాగారము ఏడాదికి 1000 రైలుపెట్టెలు నిర్మించగలిగే సామార్థ్యాన్ని కలిగి ప్రపంచములో పెద్ద ఎత్తున రైలు పెట్టెలు నిర్మించే కర్మాగారాలలో ఒకటిగా గుర్తించ

రెండవ రైలుపెట్టెల కర్మాగారము కపుర్తలలో ఏర్పాటు చేయ బడింది. సంవత్సరానికి 1000 పెట్టెలు నిర్మించగలిగే సామర్థ్యము గల ఈ కర్మాగారము మార్చి 1988 నుండి తన ఉత్పత్తిని ప్రారంభించింది. వేగంగా పయనించే రైలు బండ్లకోసం, తక్కువ భారము, ఎక్కువ వసతులు గల ఆధునికమైన రైలుపెట్టెలకు ఇక్కడ రూపకల్పన చేస్తున్నారు. రైలుపెట్టెల నిర్మాణపు పని అనేక పరిశ్రమల అభివృద్ధిని దోహదమైనది. విదేశీ దిగుమతులకు ప్రత్యామ్నాయంగా ఉత్పత్తులు చేపట్టేందుకు బెంగుళూరులో వీల్ అండ్ యాక్సిల్ ఉత్పత్తిశాఖను భారతీయ రైల్వే ప్రారంభించింది. ఈ క్రొత్త ఉత్పత్తి శాఖ 1984 లో ఉత్పత్తిని ప్రారంభించి 1986 - 87 లో 80,000 చక్రాల సెట్లును నిర్మించటం ద్వారా తని నిర్ధారిత లక్ష్యాన్ని చేరుకుంది. రైల్వే యంత్రాలను ఎగుమతి చేసేస్థితికి భారతదేశము చేరుకోవాలనే పండిత నెహ్రూ కలలను భారతీయ రైల్వే ఫలింపచేసింది. భారతీయ

రైల్వే పెట్టెల కర్మాగారము మన దేశ అవసరాల కోసం ప్రారంభించబడి నప్పటికీ, ఎగుమతుల రంగములో కూడా అది మెచ్చుకోతగిన పనిచేస్తున్నది. తైవాన్, ఫిలిపైన్స్, వియత్నాం, జాంబియా, బాంగ్లాదేశ్, మోజాంబిక్, ఉగాండా మరియు నైజీరియా లాంటి 11 దేశాలకు రైలుపెట్టెలను బోగీలను ఎగుమతి చేసింది. రైల్వే మంత్రిత్వ శాఖ ఆధీనములో పనిచేసే ప్రభుత్వ రంగ "రైట్స్" "ఇర్కాన్" సంస్థలు విదేశాలకు సలహా సంప్రదింపుల సేవలను అందజేస్తున్నాయి. ఆఫ్రికా, పశ్చిమ ఆసియా, ఆగ్నేయాసియా మరియు లాటిన్ అమెరికా లాంటి అభివృద్ధి చెందుతున్న 29 దేశాలకు సలహా సంప్రదింపులను ఈ సంస్థలు అందజేసాయి. వివిధ భాషలు, మతాల, సంస్కృతి సంప్రదాయాలకు వివిధ ప్రాంతాలకు చెందిన ప్రజలను దగ్గరకు చేర్చి వారిలో జాతీయ సమైక్యతా భావాన్ని పెంపొందించేందుకు రైల్వేలు ఇతోధికంగా తోడ్పడుతున్నాయి.

శివసుబ్రమణ్య పుష్పవనం తమిళ నాడులోని ఒక కళాశాలలో ఇంగ్లిష్ ప్రొఫెసర్. "అది జీవనం కోసం నేను చేసే పని. అయితే నా ఖాళీ సమయాన్నంతా కూడా వినియోగుదారుల ఉద్యమం కోసం వినియోగిస్తాను. ప్రయోజనాల పరిరక్షణ మండలికి నేను కార్యదర్శిని" అని శివ సుబ్రమణ్య పుష్పవనం చెప్పారు. 'అంతర్జాతీయ స్వచ్ఛంద సేవ' అనే అంశంపై ఇటీవల వాషింగ్టన్ నగరం వద్ద జరిగిన సదస్సులో పాల్గొన్న 68 దేశాలకు చెందిన 310 మంది స్వచ్ఛంద కార్యకర్తలు, స్వంచ్ఛంద నాయకులలో ఆయన (పుష్పవనం) ఒకరు. అమెరికాలోని 'వలంటీర్' అనే జాతీయస్థాయి సంస్థ, 'ఇంటర్నేషనల్ అసోసియేషన్ ఫర్ వలంటీర్ ఎఫర్ట్ అధ్వర్యంలో ఈ సదస్సు జరిగింది. ప్రొఫెసర్ పుష్పవనం మాట్లాడుతూ "మేము వినియోగదారులకు వారి హక్కులను గురించి వివరంగా తెలియజేస్తాము. వారు తమ హక్కులను వినియోగించుకోడంలోను, వాణిజ్య, పారిశ్రామిక వర్గాలనుంచి వారు దోపిడీకి గురికాకుండా పరిరక్షించడంలో సాయపడతాము" అని చెప్పారు ఆహార పంపిణీ వ్యవస్థలలో వేదలు ఎదుర్కొనే సమస్యలను పుష్పవనం వివరించారు. వస్తువు బరువు, వెల, నాణ్యత విషయంలో అవకతవకలు జరుగవచ్చునని చెబుతూ ఆయన ఇటీవల వినియోగదారుల సంఘాల సభ్యులతో ఒక స్వతంత్ర నిఘా బృందం ఏర్పాటుకు తమ సంస్థ ఏవిధంగా ఉత్తేజాన్నిచ్చిందీ తెలియజేశారు. •

## వానపాము

పరాన్న జీవులుగా ప్రత్యేకత చెందిన నిమటోడ్‌లు ఒకటి లేదా అంతకంటే ఎక్కువ జీవజాతులపై పరాన్నజీవిగా ఉంటాయి. వృక్షజాతులపై పరాన్నజీవులగా ఉండే

నిమటోడ్‌లు వ్యవసాయానికి నిరంతర సమస్యగా ఉంటాయి. వాటి గురించి ఈ మధ్య నైజేరియాలో కొన్ని ప్రయోగాలు జరిపారు. నూనె నందించే పామ్ తోటలు కస్సవతోటల పెంపకానికై కొన్ని ఉష్ణప్రాంత అడువులను తొలగించడం జరిగింది. కొత్తగా తయారుచేసిన ఈ తోటలపై ఎటువంటి క్రిమిసంహారక మందులు వాడలేదు. మొదటి పంట చివరిలో సాంప్రదాయక వ్యవసాయ క్షేత్రాలలో ఈ నిమటోడ్‌ల సాంద్రత రేటు పెరగగా, కొత్తగా తయారుచేసిన క్షేత్రాలలో వీటి సాంద్రత యాభైరెట్లు పెరిగింది. అంతేకాక ఒకే పంట పండించే క్షేత్రాలలో పోల్చినపుడు వంతులవారిగా పంటమార్పిడి జరిపిన క్షేత్రాలలో నిమటోడ్‌లు ఎక్కువగా పెరగలేదు. అడవులలోని వృక్ష జాతులపై ఆధారపడి నిమటోడ్‌లు వేగంగా పునరుత్పత్తి కాగలవు. రెండవ పంట చివరికి పంట పెరుగుదలను అరికట్టడంలో నిమటోడ్‌లు సామర్థ్యం అవగాహన అయ్యింది. నాలవ పంట చివరకు నిమటోడ్‌లు విపరీతంగా పెరిగిపోవటం వలన పంట పండించటం ఆర్థికంగా లాభసాటిగా లేదు. కాని కొత్త క్షేత్రాలతో పోల్చినపుడు సాంప్రదాయక వ్యవసాయ క్షేత్రాలలో నిమటోడ్ 16 శాతం తగ్గాయి. వానపాములు ఇతర క్రిమి కీటకాలు బయటికి కనపడక పోయినప్పటికీ వ్యవసాయంలో అత్యంత విశిష్టపాత్ర వహిస్తాయి. అంతేకాక



## నెహ్రూవాణి

వ్యక్తిని అణిచివేయడం చెడ్డది - పెరుగుదలని తుంచివేస్తుంది. అయితే, ఎటువంటి కట్టడీలేని వ్యక్తి స్వేచ్ఛ ('ఇండువిడ్యులిజమ్') అరాచకాన్ని ఆహ్వానిస్తుంది.

—1943 అక్టోబరు 16



కొన్ని ప్రాంతాలలో సాంస్కృతిక, అర్థకప్రగతికి, మరికొన్ని ప్రాంతాలలో ఈ ప్రగతిని నిరోధించటానికి కావలసిన వాతావరణాన్ని ఈ వానపాములు కల్పించాయని ఇప్పుడు మరింత స్పష్టంగా తేట తెల్లనవుతున్నది.



సత్ప్రవర్తనకి రెండు ప్రధాన సూత్రాలు వున్నాయి. ఆచరణకు ముందు: ఆలోచన; అనంతరం; ఆత్మవిశ్వాసం.

—లాయొలా

గడిచిన రోజుల వంక విచారగ్రస్తంగా చూడకండి - అవి ఎలానూ తిరిగిరావు. వర్తమానం మీ చేతుల్లో వున్నదీ. మీదీ గనక దానిని బాగు చేసుకునేందుకు ప్రయత్నించండి. క్రీనీడలచాటున దాగివుండే భవిష్యత్తులోకి భయరహితులై, ఆత్మస్థయిర్యంతో సాగండి. —స్మిత్

గొప్పదీ మర్యాదైనదీ కోట్లాది ప్రజలను జోకొట్టేదీ సినలైన మత్తునిచ్చేదీ సినిమా! —బెల్ ఫ్రెజ్

# మాలతీ చందూర్

నవలలు

| | |
|---|---|
| వైశాఖి | 16 – 50 |
| కాంచన మృగం | 16 – 50 |
| భూమి పుత్రి | 16 – 00 |
| మధుర స్మృతులు | 14 – 00 |
| ఓ మనిషి కథ | 16 – 00 |
| ఏమిటీ జీవితాలు | 12 – 00 |
| మనసులోని మనసు | 25 – 00 |
| ఆలోచించు | 9 – 00 |
| రాగరక్తిమ | 18 – 00 |
| మేఘాల మేలిముసుగు | 16 – 00 |
| కలల వెలుగు | 15 – 00 |
| బ్రతకనేర్చిన జాణ | 14 – 00 |
| జయలక్ష్మి | 20 – 00 |
| కృష్ణవేణి | 20 – 00 |
| ఏది గమ్యం ఏది మార్గం | 15 – 00 |
| ఎన్ని మెట్లెక్కినా.... | 18 – 00 |
| సద్యోగం | 15 – 00 |
| లావణ్య | 14 – 00 |

**ఇవిగాక**

| | |
|---|---|
| వంటలు – పిండివంటలు | 35 – 00 |
| ప్రశ్నలు – జవాబులు | 15 – 00 |
| జాబులు – జవాబులు | 13 – 00 |
| అల్లికలు – కుట్లు | 30 – 00 |
| అందాలు – అలంకారాలు | 15 – 00 |
| మహిళలకు మధురజీవనం | 7 – 50 |
| దాంపత్య జీవితం | 12 – 50 |

20/– రూ॥ పైబడి పుస్తకములు తెప్పించుకొనేవారు. ముందుగా ఆ పుస్తకాలధరకు 2 రూ॥ తగ్గించి M. O. పంపితే, 2 రూ॥లకు మాత్రమే V.P.P. పంపుతాము. అందువలన మీకు అసలు ధరకే పుస్తకాలు అందుతవి.

# కొత్త పుస్తకాలు

'అనువాద సమస్యలు'; రచన: రాచమల్లు రామచంద్రారెడ్డి; ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన భవన్, 4 - 1 - 435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్ - 500 001; వెల: రు. 25-00.

అటు మూలభాషా, యిటు లక్ష్య భాషా తెలుస్తే చాలు అనువాదం చేసేయవచ్చు - అని అనుకోవడంలో సత్యం లేదనీ, "అనువాద సమస్యలు" పుస్తకం చదివాక, యీ పని "నిప్పుతో చెలగాటం" అనీ అనిపిస్తుంది.

అనువాద సమస్యని స్థూలంగా పదాలు, వాక్య - నిర్మాణం అని విభజించుకొన్నప్పటికీ, తరచి చూసిన కొద్దీ అనేక సూక్ష్మ సమస్యలు పుట్టుకొస్తూ వుంటాయి. Man అనే యింగ్లీషు పదాన్ని రకరకాల సందర్భాల్లో విభిన్నమైన అర్థాల్లో వుపయోగిస్తుంటారు. Man is a social animal ; Child is a father of Man ; Man - Made ; God made Man, The tailor made the Gentle Man అని యిల్లా రకరకాలైన అర్థాన్ని ఆ శబ్దం యిస్తూ వుంటుంది. అనువాదకులు ఎదుర్కోవలసిన ఎన్నో సమస్యల్లో యిదొక చిన్న సమస్య.

సాదారణంగా అనువాదాలు రెండు రకాలుగ సాగుతూ వుంటాయి. మూడు నాలుగు వాక్యాలో, ఒక పేరాగ్రాఫో తీసుకొని అందులోని భావము మొత్తం మీద తెలిసేటట్లుగా అనువాదం చేయడం ఒక పద్ధతి. మూల రచయిత శైలీ, భావమూ రెండూ చెడకుండా ఏ వాక్యానికి ఆ వాక్యం అనువదించడం రెండో పద్ధతి. మొదటి పద్ధతి అనువాదాన్ని సులభంగా చదివింపజేస్తుంది. రెండోది మూల రచనలోని ప్రత్యేకతను యింకో భాషలో చదివే పాఠకుడికి స్ఫురింపజేస్తుంది. ఈ విషయమే రచయిత మూడు నియమాలుగా క్లుప్తీకరించి చెప్పారు. 1. మూలంలోని భావాలను సంపూర్ణంగా వ్యక్తం చేయాలి. 2. మూలంలోని శైలిని అనుకరించాలి. 3. మూలంలాగే సుబోధకంగా వుండాలి. కాని యీ మూడింటినీ అనువాదకుడు అక్షరాల ఆచరించడం సాధ్యంకాదు కనక అనువాదంలో శైలికీ, సుబోధకతకూ వుండే ప్రాముఖ్యం మూలంలోని భావం తర్వాతనే అని కూడా 'అనువాద వివరణ' అనే అధ్యాయంలో విపులంగా చర్చించారు.

ఈ పుస్తకం అంతా చదివాక అనువాద సమస్యలను ఎల్లా పరిష్కరించుకోవాలో అనే సమాచారానికి తక్కువ పేజీలు, అనువాదాల్లో కనబడే దోషాలు చూపించే వుదాహరణలకు ఎక్కువ పేజీలు కేటాయించినట్లు కనిపిస్తుంది.

అసలు తెలుగులో రచనలు చేస్తున్న వారే ఎన్నో వ్యాకరణ దోషాలు చేస్తున్నారు అనడానికి ఉదాహరణగా విశ్వనాథ సత్యనారాయణగారి రచనలో ఒక వాక్యం "శేషుడు, వాసుకి, తక్షకుడు మొదలైన మహా సర్పములు చావరు" వుల్లేఖించారు. అవి వుత్తపాములు కావు గొప్ప వ్యక్తులు అని రచయిత మనోభావం. అది గ్రహించవలసిన రసదృష్టి పాఠకునికి అవసరం కదా !

తెలుగు అకాడమీ ప్రచురించిన 'యింగ్లీషు తెలుగు - నిఘంటువు' లోని లోపాలు, దోషాలు ఒక ప్రకరణలో రచయిత వివరంగా చూపించారు. పెద్ద సంస్థలు ప్రచురించే రిఫరెన్సు గ్రంథాలే యిట్లా వుంటే వ్యాపార ప్రకటనల్లోని వ్యాకరణ దోషాలను గురించి ఆలోచించడం అనవసరం.

అనువాదాల విషయంలో తెయొడర్ సేవరీ సిద్ధాంతం సహేతుకంగానే వున్నది కాని, అంతకంటే భిన్న ప్రక్రియల్లోని సాహిత్యాన్నీ, రచనలనూ అనువదించేటప్పుడు అవలంబించవలసిన వైఖరిని విశదంగా రచయిత చెప్తే బాగుండేది. కాల్పనిక సాహిత్యం, కవిత్వం అనువదించడానికి అనువాదకులు కూడా రచయితలూ, కవులూ అయివుండటం ఎంత మేలో, వైజ్ఞానిక గ్రంథాలు తర్జుమా చేసేటప్పుడు ఆయా శాస్త్రాలలో విషయ పరిజ్ఞానం వుండటం కూడా అంత అవసరం.

వాక్యనిర్మాణ సమస్యలు అనే ప్రకరణమూ, యింగ్లీషు, యితర యూరపియను భాషలలోని పేర్ల వుచ్చారణలను గురించిన సమాచారం వుపయోగకరమైనవి.

అనువాదాలు ఎందుకు చేస్తారు ?- అని ప్రశ్నిస్తున్న ప్రకరణం, అనువాదకుల మనోగతులను ఆవిష్కరిస్తూ చక్కగా సాగింది.

చివరచేర్చిన యింగ్లీషు వ్యాసంలోనూ యింకా అనేక చోట్ల వుదహరించిన యింగ్లీషు ఖండికల్లోనూ అసంఖ్యాకమైన అచ్చు తప్పులుండి చికాకును కలిగిస్తున్నాయి.

'టైమెంత' తో ఆరంభించి, తెలుగువారు టైము అనే పదాన్ని కాలము, సమయం, సేపు, వ్యవధి, వేళ మొదలయిన అనేక పదాలకు బదులుగా వాడటం గురించి మందలిస్తూ, జటిలమైన వ్యాకరణ విషయాలు కూడా తేలిక శైలిలో వివరిస్తూ, పుస్తకం చివరివరకూ చదివింపచేస్తారు రామచంద్రారెడ్డి.

1988లో కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి పొందిన 'అనువాద సమస్యలు' గ్రంథ రచయిత 'రా-రా' మరణం, తెలుగు విమర్శక ప్రపంచానికి, తెలుగు సాహిత్యానికి పెద్దలోటు.

—సరోజినీ ప్రేమ్‌చంద్

'కళికలు' - బెజవాడ గోపాలరెడ్డి ప్రతులకు : ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001 .... రు. 10-00.

"'ఆమె' తో ఆరంభమైన ఈ ముక్తకాల పరంపర 2257 వరకు సాగునని కలలో కూడా ఊహించలేదు. 'ఆమె' ప్రేరణ ఇంత దూరము లాగింది, సాగింది" - అంటున్నారు గోపాలరెడ్డి. ఈ మధ్య వెలువడిన వాటిలో ఇది వారి పదహారవ పుస్తకం.

"డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు - ఆ బాలవృద్ధ జనసారస్వత గోపాలుడు - సమగ్ర జీవిత సర్వస్వ భూపాలుడు - వశీకృత నవభాషా కవి పండిత నృపాలుడు - అధునాతన వేద దర్శకుడు, ఋషి .... కవితిక్కన ఖడ్గతిక్కన కలసిన సమైక్య మూర్తిగా ఉపమించవచ్చు రెడ్డిగారిని. ఆయన పుట్టుకతోనే కవి, యోధుడు.... సంస్కృతంలో వాల్మీకి, తెలుగులో వేమన ఏ వయసులో సాహితీ సృష్టి చేశారో, కొంచెం ఆలోచించి చూస్తే, ఈనాడు రెడ్డిగారు సృష్టిస్తున్నదే నిజమైన సారస్వతం అనడానికి అభ్యంతరం వుండనక్కరలేదు" - అంటున్నారు బోయి భీమన్న 'గోపాలరెడ్డీయం' అని ముందుమాట రాస్తూ!

"కొంత నీతి ఆదర్శమాల క్రిందనే - జీవితము గడిచిందని అభినందించుకొనుచున్నాను - గాంధీ, రవీంద్రుల అభిమానిగనే - కొద్ది ఆదర్శములతో, కొన్ని ఆనందాలతో - జీవితమును గడుపుచున్నాను" అనే గోపాల రెడ్డిగారు, "దేవాలయాలకు వెళ్లని కోట్లలో నేనూ ఒకడను - ఇతర మతాలవారే కాక - ఆర్య సమాజము, బ్రహ్మసమాజము - తియాసఫీవారు, కమ్యూనిస్టులు, రేషనలిస్టులు - మందిరాలకు వెళ్లరు" - అంటూ, వాళ్లందరి జాబితాలోనే తనూ అని చెబుతారు. ఈ 'కళికలు' లో గోపాల రెడ్డిగారి జీవిత చిత్ర పటం కవితా ప్రసూనమై పరిమళిస్తోంది.

— క్షీరసాగరమ్

## ఈ మధ్య అందినవి :

తెలుగు పత్రికల సాహిత్య సేవ - తిరుమల రామచంద్ర - రు. 5-00 ; ఉపనిషత్ చింతన - ఏటుకూరు బలరామమూర్తి - రు. 10-00 ; బొప్పదంటు ప్రశ్నలు తృతీయ ముద్రణ - మహీధర నళినీ మోహన్ - రు. 12 - 00; కెమిస్ట్రీ కథలు (చతుర్థ ముద్రణ) - ఎన్ని గోపాలావారి - రు. 8-00; గౌతమి వ్యాసము - పింగళి లక్ష్మీకాంతం - రు. 20-00 .... పైపుస్తకాలన్నీ ప్రచురించినవాడు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన్ భవన్ 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500 001. బ్రాంచీలు ; విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం, హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

అందుకున్నవన్నీ గాకపోయినా కొన్నిటి సమీక్షలు ముందు ముందు సంచికలలో వెలువడుతాయి.

సమీక్షలు.

# చిత్రజగతి

✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠3✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠✠

## సౌదామినీ వారి 'వైశాలి'

భరతన్ దర్శకత్వంలో మళయాళ భాషాచిత్రంగా రిలీజైన ఈ 'వైశాలి' అంతర్జాతీయంగా గుర్తింపు పొందింది. దీనిని కెవివి సత్యనారాయణ తెలుగులో సమర్పించారు. ఏ భాషలో ఉన్నప్పటికీ ఈ స్క్రీన్‌ప్లే. లోని బిగువూ, దృశ్యచయనికలోని, సౌందర్య శోభ, ఆయా పాత్రలు చూపిన నటనా వైదుష్యం ఎంతో ప్రశంసనీయంగా, ఇండియన్ సినిమాకు ఖండాంతర ఖ్యాతి తెచ్చేటట్టుగా ఉన్నాయి. ఒక స్వర్ణకమలం, ఒక రుద్రవీణ, ఒక వైశాలి వంటివి దక్షిణా పథానికే గర్వకారణం. ఋష్య శృంగుని కథ, వెనక రెండు మూడు సార్లు సినిమాగా వచ్చి వుండవచ్చు. కాని, ఇందులోని వైశాలి, ఆమె తల్లి మాలిని పాత్రల రూపకల్పన, విభాండ కుని కుమారుని తన కళా ప్రాభవంతో పడగొట్టిన వైశాలి, తను ఎంతో నేర్పుగా ప్రభుకార్యం నెరవేరుస్తున్నా ననుకుంటూనే మనసు పారేసుకోవడం, పురాణ కాలంలోని రాజ గురువులు రాజనీతి కాపాడుతున్నామంటూ తమ స్వార్థాన్ని కప్పి పుచ్చుకోవడం - యిటువంటి మలుపులతో చైతన్య వంతమగు దృక్పథంతో ఒక కళా ప్రక్రియకు కావల్సిన ఉత్తమ లక్షణా లతో, ఈ పిక్చర్ ఒక మణిపూస అనీ, భరతన్ దర్శకత్వ ప్రతిభకు ఒక మచ్చుతునక అనీ చెప్పవచ్చు.

## రాజేశ్వరి వారి 'ప్రేమ'

ఈనాటి యువతీయువకులు లాలస లోను, కామాతురతలోను కొట్టుకు పోతున్నారని మధ్య వయస్కులు, వయసు మళ్లినవారు వాపోవడం అర్థ రహితం; ఈ యువతీ యువకులలో కూడా ప్రణయారాధన, నియమ వంతమగు జీవితంపట ఆసక్తి ప్రేమోపాసన వున్నాయి సుమా, వాటిని సానుభూతితో అర్థంచేసు కోండి' - అని చాటి చెప్పే ఈ చిత్రం లో పృధ్వీగా వెంకటేష్, మాగీగా రేవతి యువతలోని హృదయ సంచల నానికి, స్వేయా న్వేషణకు ప్రతీ కలుగ్గా నిలుస్తారు. ఆత్రేయ పాట

లలో కొన్ని సాధారణమైనవైనా, మరికొన్ని మనసుని ముల్లుతో గుచ్చుతాయి. ఇళయరాజా సంగీతం ఈ ప్రేమోదంత కావ్యానికి శ్రవణానందానుభూతిని యిచ్చింది. చిత్రంలో నవ్యత, సామాజిక వాస్తవికత వంటివి లేకపోయినా, సామాన్య ప్రేక్షకుని సరస సంభాషణలతోను, సుందర దృశ్యాలతోను అలరిస్తుంది. వెంకటేష్, రేవతీలిద్దరూ తమ పాత్రలకు భలాకీతనమూ ఆకర్షణా చేకూర్చారు. దర్శకత్వం : సురేష్ కృష్ణ. నిర్మాత : రామానాయుడు.

## జగపతీవారి 'సింహస్వప్నం'

జగపతిబాబు ద్విపాత్రాభినయ ప్రథమ చిత్రంలో అతను రాజేష్, హరీష్. ఇద్దరూ ఒకే తల్లి (జయసుధ) కవలలు - కష్టాలలో ఉన్న ఆ తల్లి, తనకు ఆశ్రయమిచ్చిన వారి యింట ఒక పసికందుని వొదిలేసి, మరొక పసివానితో విశాల ప్రపంచంలోకి వెళ్లిపోతుంది. విలన్‌ల దగ్గిర (గొల్లపూడి, రంగనాథ్) లారీ డ్రయివరుగా పని చేసిన బలరామ్ (కృష్ణంరాజు), తమ్ముని కోల్పోవడమే గాకుండా జైలుపాలవుతాడు ; గర్భవతి అయిన అతని భార్యను మంటలకాహుతి చేశామనుకుంటారు విలన్‌లు. కాని, దుర్మార్గుల పాపం పండాలి గనక, ఆమె బతుకుతుంది - కవలలని కంటుంది. జైలునుంచి విడుదలైన బలరామ్, కృష్ణార్జున్‌గా కోటీశ్వరుడై, నూతన సమాజస్థాపనకు 'సింహస్వప్నం'గా విద్రోహశక్తులని సంహరిస్తుంటాడు. పోలీసుశాఖని ఉదరింపజేసిన ఈ 'సింహస్వప్నం', తమ పితృపాదులని రాజేష్, హరీష్‌లు తెలుసుకోవడం యిందులోని యితివృత్తం అయితే, స్క్రీన్‌ప్లే చాలా చక్కగా, సస్పెన్స్‌తో, ఆసక్తి దాయకంగా ఉంది. వాణీ విశ్వనాథ్, శాంతిప్రియలు ద్విపాత్రలకు కథానాయికలు. కృష్ణంరాజు తన అభిమానులని మెప్పించే ఈ చిత్రానికి దర్శకులు : మధుసూదనరావు.......... నిర్మాత : రాజేంద్రప్రసాద్.

## సరస్వతీ ఫిలింస్‌వారి 'మళ్లీ జాంగో'
## (Django Strikes Again)

ఫ్రాంకో నీరో కథానాయకునిగా 'జాంగో' పిక్చర్ యించుమించు పదేళ్లక్రితం వచ్చింది. కాని, సినీప్రేక్షకులు ఆ పాత్రని అంత జ్ఞాపకం పెట్టుకున్నారూ అంటే, ఆ పాత్ర స్వరూపంలోని విలక్షణతే అందుకు కారణం. ఆంగ్ల చిత్రాలలో సెక్సూ్క్రయిమూ, వైలెన్సూ వుండవని కాదు, వుంటాయి. మోతాదుకి మించే ఉంటాయి. అయితే, అసందర్భంగాను, అసంభవనీయంగాను, కథాసన్నివేశానికి పొంతన లేకుండానూ ఉండవు. ఈ చిత్రంలోని జాంగో, ఒకనాటి యుద్ధవీరుడు, తుపాకీ పేల్చడంలో గొప్పనిపుణుడు ; అతను ప్రశాంతంగా రోజులు వెళ్లబుచ్చుతున్న సమయంలో, ఒకనాటి

స్నేహితురాలు కడపటి దశలో ఉండి, పరమ రహస్య మొకటి చెవిలో చెబుతుంది. జాంగో ద్వారా తనకు కలిగిన ఆడపిల్ల, పదహారేళ్ల చంద్రవదన ఒర్లొస్కీ అనే రాకుమారునికి (ఓడ యజమాని), బానిసగా చిక్కిందని! జాంగోలోని పితృవాత్సల్యం పెల్లుబికి మళ్లీ తుపాకీ చేతబడతాడు. అనేక సాహస కృత్యాలతో ఒర్లొస్కీని, అతని నావికులనీ, ఓడనీ సమస్తం సర్వనాశనంచేసి, ఖైదీలుగా చిక్కిన బానిసలందరికీ విముక్తి ప్రసాదిస్తాడు. 'అమ్మా, నువ్వు నాతో వస్తావా? ఇక్కడి వాళ్లతో వుండిపోతావా?' - అని అడుగుతాడు కూతురుని, 'పెరిగిన చోటు - తెలిసిన ముఖాలు - ఇక్కడే వుండిపోతాను' - అంటుంది .... క్షితిజరేఖ వైపుగా నడుస్తుంది జాంగో ఎక్కిన గుఱ్ఱం .... పిఆర్ఒ : టియమ్ రామన్.

## లక్ష్మీకృపవారి 'హైహై నాయకా'

జోకులు విసురుతూ, నవ్వులు చిందించే ఈ కామెడీ చిత్రంలో 'హైహై నాయకుడు' ఒక చిన్న రాయుడుగారు (కిరణ్). ఆ కుమార రత్నం తన తండ్రిగారి వద్ద నుంచి (పెద్దరాయుడుంగారు - కోటశ్రీనివాస రావు) బండ బూతులు నేర్చుకు, వాటిని చదువు చెప్పే మాస్టర్లపై ప్రయోగించడం ద్వారా తనపాండిత్యం వెల్లడించుకుంటూ వుంటాడు. ఊతపదంగా బూతు లేనిదే మాట పలకలేనివారు పల్లెటూళ్లలోనే కాదు, పట్నాలలోనూ వున్నారు, మనచుట్టూ కూడా వున్నారు. ఆ దురలవాటుని సంస్కరించుకోమని చెంప దెబ్బ కొట్టే చిత్రమిది - నీతి బోధకంగాగాక



హాయిగా నవ్వించే హాస్యగుళికలతో చెబుతుంది .... తెలుగు మాష్టారు రామకృష్ణ (నరేష్) నిరుద్యోగిగా నానాకష్టాలూ పడి, స్నేహితుడొకడు పిలిపించగా అపల్లెటూరి హైస్కూలుకి వచ్చి, మిగతా టీచర్లు చేయలేని పనిని (దండమ్ దశగుణమ్ భవేత్ - చిన్న రాయుడుకి నాలుగు చురకలు అంటించడం), తను చేసి, బాలునిలో బ్రహ్మాండమైన మార్పు తేవడమే గాకుండా, పెద్ద రాయుడుగారి మెప్పు పొంది, తన పెళ్లితోబాటు మరో యిద్దరి పెళ్లిళ్లుకూడా జరిపిస్తాడు. రచన అదివిష్ణు. దర్శకులు జంధ్యాల తనదైన ప్రత్యేక బాణీలో తీర్చిదిద్దిన తీరు, ఈ పిక్చర్నొక నవ్వులజల్లుగా చేస్తోంది. ఇంటిల్లపాదీ ఆనందించే చిత్రం. నిర్మాతలు ; గోవర్ధన్, గుణశేఖర.

## సాయీసుధ వారి 'భలే దంపతులు'

ఇందులో రెండు జంటలు ఉన్నాయి. ఒకటి : పాత దంపతులు ఆనందరావు, సుధ, (నాగేశ్వర్రావు, జయసుధ) ; రెండు : కొత్త దంపతులు రాజా, వాణి (రాజేంద్ర ప్రసాద్, వాణీ విశ్వనాథ్). బస్సులో వెళ్లడమంటే సరదా పడే భాగ్యవంతులమ్మాయి వాణికి వెనకగా నిలబడ్డాడు రాజా. బస్సు కుదుపు కారణంగా చేతిలోని చిట్టచివరి రూపాయి బిళ్ల ఆమె జాకెట్లో పడుతుంది. నిరుద్యోగి అయిన రాజాతో మనోవికారమేమీ కలగదు గాని ఈమె ఆ యువకుని వలవేసి పట్టుకు, తమ బిజినెస్‌కి డైరక్టరుని చేస్తుంది. అయితే, మధ్యలో ఒక చిన్న మెలిక ఉంది. చింతపండు వ్యాపారి నారాయణస్వామిని (కోట శ్రీనివాసరావు) ఈ పెళ్లికి వొప్పించేభారం, బగ్నప్రేమికుడైన రాజాని, రైలు పట్టాల మీదనుంచి కాపాడిన ఆనందరావుపై పడుతుంది. అతనూ యిలాగే శ్రీమంతులమ్మాయిని ప్రేమించి పెళ్లి చేసుకున్నవాడే - మామగారు రాజభూషణరావు (నూతన్ ప్రసాద్) భాగ్యవంతుడు, తను పేదవాడు. దంపతుల మధ్య పేచీలొచ్చి, ప్రస్తుతం యిద్దరూ విడిగా, చెరో చోటా ఉంటున్నారు. ఈ పాతకథా, నడుస్తున్న కొత్తకథా ఒకదానితో ఒకటి ముడిపడుతూ, ఫ్లాష్‌బాక్‌తో పాతకథ అధ్యాయాలుగా వెల్లడవుతూ, చివరికి రెండు జంటలూ చీకట్లను తరిమి వెలుగు చూడగలగటం ఈ చిత్ర కథాంశం. నాగేశ్వర్రావు .జయసుధల నటనా కౌశలం పిక్చరుకి నిండుతనమిస్తోంది. దర్శకత్వం : కోడిరామకృష్ణ : నిర్మాతలు : సత్య ప్రతాప్, సాయి శ్రీనివాస్.

## ఎ వి య మ్ వారి 'బామ్మమాట - బంగారుబాట'

రాజేంద్ర ప్రసాద్, గౌతమి హీరో హీరోయినులుగా ఉన్న ఈ చిత్రంలో బామ్మగారు భానుమతి - తమిళ మాతృకలో ఆ పాత్రను మనోరమ వేసింది .... అబ్బాయీ, అమ్మాయీ రైలు ప్రయాణంలో, కూపెలో, తటస్థపడతారు. తను అంధురాలినని మొదట

అబద్ధం చెప్పిన ఆ అమ్మాయి, తల్లి దండ్రులు లేని దానిననీ, పెంచి నావిడ తనని దుర్మార్గులకి అమ్మి వేదామను కుంటూండగా, తను యిలా రైలెక్కి వచ్చేశాననీ, బిఏ పాసయానని మర్నాడుదయం చెబుతుంది. ప్రగల్భాలు పలకడంలో ప్రవీణుడైన ఆ అబ్బాయి, రైలు దిగి ఊళ్లోకి వెళ్లగా పట్టభద్రుడైన తమ గ్రామ ప్రథమ పౌరునికి, భారీఎత్తున జానపద నృత్యాలతో, పెద్ద పులి వేషాలతో స్వాగతోత్సవం జరుపుతారు ఊరి వాళ్లు - అంతా బామ్మగారి ఏర్పాటు. ఇరవై ఏళ్లొచ్చిన మనుమడికి పెళ్లి సంబంధం కూడా ఆవిడే చూసి మాట యిస్తుంది. అయితే ఈ అందగాని మనసు అప్పటికే అన్యాక్రాంతమై పోయింది. తన ప్రియురాలిని దుర్మార్గుల వుచ్చుల్లో నుంచి పదిలంగా కాపాడి, పోలీసుస్టేషన్ చేరుకుంటాడు. ప్రేమ వివాహాల పట్ల అమిత విశ్వాసం గల ఆ యినస్పెక్టరు, డ్రాయరు సొరుగులో నుంచి పసుపుతాడు తీసి యివ్వగా, వీరు నవదంపతులవుతారు. పట్నం వచ్చి ఎన్నో కష్టాలు అనుభవించి, అపార్థాలకు లోనవుతారు. ఆ తరువాత బామ్మగారు రంగప్రవేశం గావించి వాకింగ్‌స్టిక్ చక్రాయుధంగా మార్చి, వీరోచిత పోరాటం జరిపి, ఆమె దగ్గిర చాలా బంగారం ఉందిగనక బంగారు బాట వేస్తుంది: దర్శకత్వం: రాజశేఖర్, నిర్మాతలు: శరవణన్, బాలసుబ్రమణ్యన్, యమ్మెస్ గుహన్.



?

"Father, Bharata came back from his uncle's place, learnt of the unexpected tragedy, scolded his mother Kaikeyi unsparingly for her stupid behaviour and then rushed to Rama with the entire royal retinue following him ... " said Raghu

"Yes, he wanted to apologise and appeal to his brother to return and take the reins of power", explained Raghu's Father.

"Bharata's entreaties fell on deaf ears. Rama was adamant in his forward march and gave his pairo fs andals, of course, at the request of Bharata. What a mockery to keep a pair of sandals on the royal throne?" observed Raghu with a sense of disappointment.

"It all depends on the way you look at it. Padukas are symbolic of the continuity. The shrewd lady Kaikeyi, stipulated the banishment period to fourteen years as she was aware that Rama, by sheer lapse of time, would disinherit the throne according to the legal system of those times. So, Bharata saw to it that the continuity is preserved by placing Rama's padukas on the throne and he carried on the administration for those fourteen long years in the name of Rama, staying at Nandi-gram, away from the royal capital Ayodhya."

---

# మజిలి

## అన్నపూర్ణా రెడ్డి

గడిచిన కథ : ధనవంతు లమ్మాయి జ్యోత్స్న, డాక్టరు సారథిని ప్రేమించి పెళ్లి చేసుకొంది. ఇద్దరు పిల్లలు కలిగారు. రోజులు నిస్సారంగా తోచడంతో, ఆమె తన పిల్లలను భర్తగారి సంరక్షణకు వొదిలేసి, సౌందర్యోపాసి వెంట వెళ్లి పోయింది. పరిణతి పొందిన పురుషుడు సారథి, పిల్లలపట్ల తనకు గల కర్తవ్యం నెరవేరుస్తున్నాడు .... ఇక చదవండి.

తనమాట వదిన కాదనదనే పిచ్చి నమ్మకం. గాయత్రికి అందుకే తప్పంతా తన అన్నయ్యదే.... వదినను సమర్ధిస్తూ మాట్లాడేది. చెరో ప్రక్క తల్లీ చెల్లీ పోరినా చిరునవ్వే సమాధానంగా మిగిలిపోయింది.

విసుగొచ్చి "నీ ఖర్మ".... అంటూ వెళ్లిపోయారు. కోపంతో కొద్ది రోజులు గాయత్రి అన్నయ్యకు ఉత్తరాలు కూడా వ్రాసేది కాదు.

ఆ వూరు నుండీ గుడివాడకు బదిలీ అవడముతో కొంత అవ మానాన్ని, ఇరుగుపొరుగుల కుతూ హలాన్ని వదలివేసి క్రొత్త చోట క్రొత్త జీవితాన్ని ప్రారంభించడం కొంత ఉపశమనం కలిించిందనే చెప్పాలి.... అక్కడ ఏడాది జరిగాక ....గరికపాడు .... "సారథీ" ....

ఆలోచనా స్రవంతిలో కొట్టుకు పోతున్న సారథి ఉలికిపడి ఏమి టన్నట్టు చూశాడు.

పున్నమి చంద్రుడు ఆకాశాన ఠీవిగా కొలువు తీరి వున్నాడు. ఊరికి దూరంగా నడిచి, రోడ్డు ప్రక్కన పొలాల్లో ఏదోమిల్లు కోసం కట్టిన పునాది మీద కూర్చుని వున్నది తామిద్దరే .... ఒకప్పుడు ఏకశరీరంగా మెలిగినతాము మరీ చేరువలో వున్నా ఒకరికొకరు యోజనాల దూరంలో వున్నారు.

"నేను .... నీ జీవితం నుండీ తప్పుకుపోయానని కోపం కదు ?" వెన్నెల్లో అతడి కళ్ళలో దీనికోసమే వెదుకుతోంది జ్యోత్స్న.

"కోపతాపాలకు తావు లేదిక్కడ" అంటూ హృదయాన్ని చూపించాడు. "ఒక వ్యక్తిని ద్వేషించాలన్నా, ప్రేమించాలన్నా వాటికి ఒక్కసారి కారణం వుండవచ్చు, లేకపోవచ్చు"

"విచిత్రంగా మాట్లాడుతున్నావు సారథీ ...

"గతజల సేతు బంధనం"

"ఇందాక ఇంటిలో పిల్లలు నన్ను ఇరుగింటి పొరుగింటి అంటీలాగ పలుకరింవారు. వాళ్లు కూడా చాలా మారిపోయారు. నీ పెంపకంలో పిల్లలు .... నిన్ను మించి పోయేట్టున్నారు........ సారధీ"

"ఊ"

"జానకి ఎవరు ?"

"సాటి మనిషి"

"అంతేకాని నీ జీవితానికీ ఆమెకూ ఎలాటి ముడిపడి లేదా ?"

జ్యోత్స్న ఎంత కాదనుకున్నా ఆమెలోని స్త్రీసహజమైన కుతూహలం తొంగిచూస్తూంది ....

"పడకేం .... సహృదయురాలు, కడుపు చూచి అన్నం పెట్టే తల్లి .... బాధ్యతెరిగి ఇల్లు చక్క దిద్దుకొనే స్త్రీ మూర్తి .... తన వారు కాకపోయినా ప్రేమాభిమానాలు కుమ్మరించి తల్లిలేని లోటు తీర్చి పాలించే మాతృమూర్తి .... అంతకన్నా ఏం చెప్పగలను...."

"మంచిది, సారధీ .... నేను ఉదయమే .... ఫస్ట్ బస్‌కు వెళ్ళిపోతాను .... ఉదయం అయిదు గంటలకు బస్సు వుందట. వచ్చేటప్పుడు వాకబు చేసివచ్చాను"

సారధిని వదిలేసి వెళ్ళిపోయిన జ్యోత్స్న ఇన్నేళ్ళ తరువాత సాయంత్రం ఆఖరు బస్సులో వచ్చింది .... ఎందుకొచ్చావని అడగలేదు సారధి .... వచ్చినందుకు మనసు ఆనందంతో గంతులు వేయనూ లేదు .... రోజూ చూచే స్నేహితురాలిలా పలుకరించాడు .... జానకి, వచ్చిన అగంతకురాలికి స్నానానికి నీళ్లు తోలివి, వేడి వేడి కాఫీ ఇచ్చింది ....

"కాస్సేపు ఎటైనా వెళ్దాం, సారధీ" అని జ్యోత్స్న అడిగినపుడు.... నడుచుకొంటూ బండి బాట వెంట ఊరి వెలుపలికి వచ్చాడు.

"బాబోయ్ కాళ్ళు నెప్పెడుతున్నాయి" అంటే, ఆ ప్రక్కనే పునాదుల మీద కూర్చున్నారు ....

ఇపుడు, "వెళ్ళిపోతున్నాను ఉదయం" అని చెపుతోంటే .... ఊరు కుండిపోయాడు. "రెండు రోజులు వుండి వెళ్ళు, జ్యోత్స్న" అని స్వాతంత్ర్యంగా చెప్పలేని పరిస్థితి .... ఒకప్పటి భార్య .... పిల్లలకు తల్లి ....

"నీ ఇష్టం అలాగే కానియ్ ...." అన్నాడు.

కాస్సేపు మౌనంగా కూర్చుండిపోయారు .... వాచీ తీసి చూచుకొని "వెళ్దామా" అన్నాడు. లేచి నుంచుని చుట్టూ కలియ చూచింది జ్యోత్స్న.

చంద్రికలు పుడమిపై పరచుకొని వింత శోభను కూర్చు తున్నాయి. ఎగుడు దిగుడు భేదం లేకుండా తరులతల వ్యత్యాసం లేకుండా ఏకంగా వెన్నెల ముంచెత్తుతూ మెరిసిపోతూంది.

క్రింద దిగి చేయందించాడు సారధి. ఆ చేయినందుకొని క్రిందకు దిగింది జ్యోత్స్న. ప్రక్క ప్రక్కనే నడుస్తూ ఇల్లు చేరుకున్నారు. దారివెంట ఇద్దరి మధ్యా మౌనమే తోడునుంచుంది.

ఇల్లు చేరుకొనేసరికి పిల్లలు హోం వర్కు వేసుకొంటున్నారు, ప్రక్కనే కూర్చొని వారికి తెలియని విషయాలు వివరిస్తోంది జానకి.

నిశ్శబ్దంగా వసార దిగువ నుంచొని పిల్లలను, జానకిని కొన్ని క్షణాలు గమనించి 'నీవదృష్టవంతుడివి సారధీ ....' మనసులోనే అభినందించింది జ్యోత్స్న.

అలికిడైతే తలెత్తి చూచింది జానకి ప్రక్క ప్రక్కన నిలచిన ఆజంటను చూచి తల వాల్చుకొని, లేచి లోనికి వెళ్ళి డైనింగ్ టేబుల్ సర్దసాగింది. తల్లి అంటే బాబుకు లీలా మాత్రంగా గుర్తున్నా, జానకి అలనా పాలనల్లో మరుగు పడిపోయిందా జ్ఞాపకము. ఇక విజయకు అసలే గుర్తులేదు ....

పుస్తకాల్లోంచి తలెత్తి చూచి చిరునవ్వులు చిందించి తిరిగి రాసుకోవడంలో మునిగి పోయారు పిల్లలు.

"ఏం రాసుకొంటున్నారు బాబు" అంటూ దగ్గరగా వచ్చి బాప మీద కూర్చుంది జ్యోత్స్న ...

"హోం వర్కు, అంటీ" నదురు బెదురు లేకుండా జవాబిచ్చింది విజ్జి.

కొరడాతో ఛళ్ళున చరిచినట్టు అదిరిపడింది జ్యోత్స్న .... వెంటనే సమాళించుకొని .... "అలాగా ....







ఏదీ చూడనీ" అంటూ వాళ్ళ పుస్తకాలు తిరగేసి "బాగా చదువుకోండి" అంది విజ్జీ ముఖానికి జారిపడ్డ బాబ్డ్ హెయిర్‌లోని వెంట్రుకలను పైకి తోస్తూ ....

"మా క్లాసులో నేను ఫస్ట్, ఆంటీ" గర్వంగా బదులిచ్చాడు రవి.

'అలాగా బాబూ...' బుగలు పుణికి కాలరు సవరించింది జ్యోత్స్న.

ఆ దృశ్యాన్ని క్షణకాలం తిలకించి లోనికి వెళ్ళాడు సారధి.

వచ్చిన గెస్ట్ ఎవరో తెలియక పోయినా స్పెషల్‌గా వండిన పదార్థాలు పళ్ళాలలో వడ్డించింది జానకి.

సుష్టుగా భోంచేసి "అదృష్టవంతుడివి, సారధీ" మనస్ఫూర్తిగా అభినందించింది జ్యోత్స్న.

మిన్నకుండిపోయాడు సారధి.

చేయికడుక్కుని జానకి అందించిన తమల పాకులు అందు కొంటూ "కమ్మటి భోజనం కడుపునిండా పెట్టావ్ - థాంక్స్" అంది జ్యోత్స్న.

బిడియంగా తల వాల్చుకుంది జానకి.

పిల్లలు మరుదినం నిద్ర లేచేసరికి జ్యోత్స్న వెళ్ళిపోయింది. ఎవరో నాన్నగారికి తెలిసిన 'ఆంటీ' వచ్చి వెళ్ళిందన్నట్లు పిల్లలు ఆమె విషయమే ప...

జానకి మనసులో మాత్రం ఈవిడ అందరిలాంటి చుట్టం కాదు. డాక్టరు గారిని ఆవిడ చూచే చూపుల్లో, మాట్లాడే తీరులో, ఇంటిలో మసలుకొన్న తీరులో ఏదో, ఇంకేదో అనుబంధం ఈ ఇంటికి ముడివడి వుందన్న భావం నాటుకుపోయింది.

సారధి మనసు లోతయిన సముద్రంలా గంభీర ముద్రను దాల్చింది. ముఖంలో ఏలాంటి భావాలు ప్రస్ఫుటం కాలేదు.

గాయత్రి అన్నట్టు ఒకవేళ ఈవిడ గారు ఆమె వదినగారు కాదుకదా ? మరి పిల్లలు తల్లి వొడిలో చేరలేదే ? .... ఆ తల్లి అయినా లాలించదేం .... కన్నతల్లి పసి బిడ్డలను వదలి వుండగలదా ? పిల్లలు అన్నట్లు కుటుంబానికి బాగా తెలిసిన ఆంటీ ఏమో ?.... ఎటూ తెలుసుకోలేక ఆలోచించడం మానేసింది జానకి.

## 18

ఉభయ సంధ్యలు, పగలు రేయిలు, వారాలు పక్షాలు మాసాలు .... దొర్లిపోతున్నాయి. ఆరోజు ఉదయం యథా ప్రకారం హెల్త్ సెంటర్‌కు వెళ్ళిన సారధి మధ్యాహ్నం భోజనానికి రాలేదు. కనీసం భోజనం పంపమని కూడా కబురు చేయలేదు.

సారధి కోసం ఎదురు చూస్తూ వీధి వాకిట్లోకి ఇంట్లోకి కాలు కాలిన పిల్లిలా తిరుగుతూ రెస్ట్‌లెస్‌గా గడిపివేసిందా పగలంతా జానకి.

సాయంత్రం పనులు చక్కబెట్టుకొంటూంటే, వీధిలో అలికిడి అయితే ఆత్రుతగా ముందు గదిలోకి వచ్చింది.

ఖద్దరు పంచె లాల్చీ ధరించి భుజం మీద జారీ కండువా కాళ్ళకు కిర్రుచెప్పులు వేసుకున్న నడివయసు వ్యక్తి, ఇంగిట నుంచొని "డాక్టరుగారూ,

డాక్టరుగారూ ....'' అంటూ హెచ్చు స్థాయిలో పిల్చాడు. అతడి పిలుపులో దూకుడువుంది.

తలుపు చాటుకు తప్పుకొని ''వారింకా రాలేదండీ'' అంది జానకి.

''సరే! ఎప్పుడొస్తారో రానియ్. ఇక్కడే కూర్చుంటా .... ఈవేళ అతీ గతీ తేల్చుకోవాల్సిందే''.... స్వగతం అనుకొంటూ వసారాలో వేసిన గ్రాడెజ్ కుర్చీలో కూర్చున్నాడు.

ఆనాటి దిన పత్రిక, మరి కొన్ని వారపత్రికలు కాస్త ముందుకు వొంగి ప్రక్క కుర్చీమీద వుంచి లోనికి తప్పు కుంది జానకి.

మరో పావుగంట గడిచేసరికి ఆ వూరిలో కెల్లా షావుకారు పెద్దినాయడు అరవై ఏళ్ళ స్థూలకాయాన్ని కదిలిస్తూ డాక్టరు ఇంట ముంగటికొచ్చాడు.

కాలు మీద కాలేసుకొని పేపరు తిరగేస్తున్న మునసబును చీత్కారంగా చూచి, కుర్చీ కాస్త ఎడంగా లాక్కొని కూర్చున్నాడు పెద్ద నాయుడు.

సాయంత్రం దాదాపు ఆరు గంటల వేళ ఇంటికి తిరిగి వచ్చిన సారథి దూర దూరంగా రెండు కుర్చీలలో ఎడముఖం, పెడముఖంగా కూర్చొని వారపత్రికలు తిరగేస్తున్న మునసబు, షావుకారును చూచి ''పెద్దలు శ్రమ తీసుకొని చాలా దూరం వచ్చారు''.... అంటూ చిరునవ్వుతో పలుకరించాడు.

సారథి బట్టలు నలిగిపోయి, క్రాపు చెదరి, ముఖం పీక్కుపోయి అలసట ప్రస్ఫుటమౌతోంది.

భుజాల మీద అడ్డుగా వ్రేళ్ళాడు తున్న స్టెతస్కోపు 'నేనూ అలసి పోయాను' అన్నట్టు వేళ్ళాడుతోంది.

డాక్టరును రెండు జతల కళ్లు ఆపాదమస్తకము క్షణకాలం తిల కించాయి.

''శ్రమ తీసుకొని రాక పోతే మమ్మల్ని బతకనిస్తున్నావా డాక్టరూ!'' ఎడ ముఖంగానే ఏక కాలంలో డాక్టరు మీదకు దండ యాత్ర ప్రారంభించారు.

ఇద్దరు వ్యక్తులు శత్రువులైనా, మూడవ వ్యక్తి పైకి దండయాత్ర చేయాలన్నపుడు శత్రుత్వం నశించి ఆ స్థానే తాత్కాలిక మిత్రృత్వం చోటు చేసు కుంటుంది, అదే దండనీతి. అదే పాటిం చారు మునసబు, పెద్దినాయుడు.

''డాక్టరు వృత్తి రీత్యా ఒకరిని బ్రతకనివ్వడమే అతని ధర్మం .... బ్రతక నివ్వకపోవడం అంటూ లేదే .... ఒక్కక్షణం'' అంటూ లోనికి వెళ్లి ''జానకీ మూడు కప్పుల కాఫీ''.... కాస్త బిగ్గరగాని కేకవేశాడు సారథి.

పొరబాటునైనా హెచ్చుస్థాయిలో వినిపించని సారథి గొంతు ఉచ్ఛ స్థాయిలో వినేసరికి కాస్త ఆశ్చర్య మన్పించింది జానకికి.

మౌనంగా మూడు కప్పుల్లో కాఫీ పోసి ట్రేలో సర్ది భుజాల నిండుగా పమిట చుట్టుకొని హాల్లోకి వచ్చింది.

'బైట పెద్దలున్నారు. వారికివ్వు' అన్నాడు సారథి.

కాపి ట్రేతో ముందు నుంచున్న జానకిని చూస్తూ ''అబ్బె! .... ఎందు

నాణ్యత మా తయారీ! ఖ్యాతి తెచ్చినది

త్రివేణి

కోట్లాది ప్రజలు కోరుకునే
సుగంధ వక్కపొడి






త్రివేణి నట్ పౌడర్ మాన్యుఫాక్చరింగ్ కో.,
మచిలీపట్నం-521 001.

కమ్మా శ్రమ" అంటూనే పొగలు సెగలు కక్కే కాఫీని అందుకున్నారు.

ఈలోగా సారధి కూడా వచ్చి మిగిలిన కప్పు అందుకొని ఇద్దరికీ మధ్య ఓ కుర్చీలాక్కొని కూర్చున్నాడు.

కాఫీ పూర్తి చేసి కప్పు నేల మీదుంచి "చెప్పండి మునసబుగారూ .... విషయాలేమిటో, ఇందాక నిష్ఠూర వాక్యాలు పలికేరు ...." అన్నాడు, మునసబు వైపు తిరిగి సారధి.

"డాక్టారూ .... అస్సలు ఆస్పత్రిలో నీ ఉజ్జోగం గైరు హాజరు ఉజ్జోగవా?"

"ఏమిటండీ అంత పెద్ద అభియోగం చేస్తున్నారు ?" - చిన్నగా నవ్వాడు సారధి.

మనసు పిసరంత మెత్త పడా వెంటనే సర్దుకొని "ఆ .... లేకపోతే ఏదంట! పొద్దుటేళ మా యాడోళ్ళు ఆస్పత్రికి సూయించుకోవడానికి కొస్తే .... తలెత్తి చూడనన్నా లేదంట, గిరుక్కున తిరిగి యాడికో వెళ్ళిపోయినా వంట?" అభియోగం వింటూంటే సారధి పెదిమెలపై సన్నని హాసరేఖ విరిసింది.

"మీరు, షాహుకారు గారూ !"

గుర్రుగా చూస్తూ, "అదే నేనూ అడగబోతూంట .... ఆస్పత్రి యాళకు నా భార్య పరీచ్చ చేయించుకుందామని వస్తే కూర్చోమని చెప్పి అయిపు లేకుండా వెళ్ళిపోయినావంట. ఇదిగో డాకారూ ! ఊళ్ళో ఇంతవరకూ ఏ డాక్టారూ ఇట్టా నిర్లచ్చంగా ప్రవర్తించలేదు. షావుకారంటె సేతులు గట్టుకొని అర్ధరాత్రి రయినా అపరాత్రి రయినా ఇంటికి పరుగెట్టుకొచ్చి చూసి నోళ్ళే ! అంత నిర్లచ్చం మా దగ్గిర పనికిరాదు. అదేందో తేల్చుకుందామని వచ్చినా."

సారధి పెదవులపై చిరునవ్వు మాయమైంది. ఆస్థానే గంభీరత చోటు చేసుకుంది.

"రోజులు ఎప్పుడూ ఒకేలాగ జరగాలనుకొంటే పొరపాటే అవుతుంది. .... వైద్యుడిగా నాకున్న బాధ్యతలు నెరవేర్చడంలో పొరబాటు చేయనంతవరకూ నాపై ఎన్ని అభియోగాలు వచ్చినా ఫరావాలేదనే అనుకొంటున్నాను !" తూచి తూచి అన్నాడు సారది.

"ఏందండీ .... అంత డొంక తిరుగుడు వ్యవహారం.... ఆస్పత్రికి వచ్చిన రోగులను కాదని అయిపు అజ లేకుండా డాక్టరు ముఖం చాటు వేస్తే నోరు మూసుకొని వుర్కోండడానికి ఇదేం పట్నవాసంగాదే ...."

"అట్టా అడుగు బాగుంది!" షావుకారు మునసబుకు వత్తాసు పలికాడు.

చాలా సేపు మౌనంగా వుండిపోయాడు సారధి.

అరచేత్తో గడ్డం రుద్దుకొని "పట్నవాసమైనా పల్లెటూరైనా, వైద్యుడి నిర్లక్ష్యాన్ని భరించాల్సిన అవసరం లేదు. .... వైద్యుడిగా నాకున్న బాధ్యత నిండుగా నిర్వహించాలనే అనుకొంటున్నాను."

"ఏందది ? అయిపు లేకుండా ఎల్లిపోయా ?"

"అవన్నీ చెప్పుకోవాల్సిన అవసరం లేదు.... అయినా పెద్దవారు .... తెలియక ధూం ధాం లాడుతున్నందుకైనా విషయం చెప్పక తప్పదు" అంటూ రంగడి పెళ్ళాన్ని పెద్దహాస్పిటల్లో చేర్పించిందీ, అడ్డం తిరిగిన పిండాన్ని అపరేషను ద్వారా బయటికి తీసి తల్లీ పిల్లా కులాసా చిక్కినాక, తనురావడం వివరంగా చెప్పేసరికి, మునసబు పెద్దినాయుడు ముఖాలు చూసుకున్నారు .... వాళ్ళ ముఖాల్లో ఆశ్చర్యం స్పష్టంగా తారట్లాడింది ....

అయినా బింకాన్ని వదలేదు. అభిజాత్యం అందించింది.

"మాకన్నా ఆ హరిజనులే నీకు దగ్గరలే డాక్టరూ !" - పెద్దిరెడ్డి నిష్ఠూరంగా మాట్లాడాడు.

"అయ్యా, నేను వైద్యుణ్ణి, నావృత్తి వైద్యం.... ఇక్కడ కులం మతం, బీద గొప్పతేడాల ప్రసక్తి లేదు. ఎవరి రోగానికి ఎక్కువ ప్రాధాన్యం ఈయాలో....వారే నాకు ముఖ్యులు.... పెద్దలు ఈలాటి చిన్న విషయాన్ని మీ ఎదుట మాట్లాడాల్సి వచ్చినందుకు చింతిస్తున్నాను.

"రేపు ఉదయాన్న మీ ఆడవారిని 'పిహెచ్‌సి'కి పంపండి చప్పున చూసి పంపిస్తాను" - మరోమాటకు తావివ్వకుండా లేచేడు సారథి.

"బతక నేర్చి నోడివయ్యా డాక్టరు మాటల్లో గారడీ చేస్తావు. పదయ్యా మునసబూ !" అంటూ ఇద్దరు పెద్దలూ కండువాలు దులుపుకొని వసారా దిగిపోయారు.

హాల్లోకి వచ్చి ఒళ్లు బద్ధకంగా విరుచుకొని అక్కడ బల్ల మీదున్న పేపరు చేతిలోకి తీసుకున్నాడు సారథి.

"బాబుగారూ, స్నానానికి నీళ్లు తోడివుంచాను" అంది జానకి.

'వస్తున్నా' అంటూ హెడ్ లైన్స్ చదివి పెరట్లోకి నడిచాడు.

మరో నెలరోజులు ఇట్టే గడిచిపోయాయి. విజ్జి, రవిల చదువయాక "నాన్న ఇంకా రాలేదేం, పిన్నీ," అని విజ్జి అడిగింది.... "కేంప్ వెళ్ళాడేమో" - అని సర్దాడు రవి. నారాయణ అక్షరాలు కాస్సేపు దిద్దుకొని పలక ప్రక్కకు గిరాటేసి స్కూల్లో పిల్లలు చేసే అల్లరి ఆగం గురించి చేతులు తిప్పుకొంటూ అభినయించి నవ్వించాడు. త్వరగా పొద్దుగుంకిపోయింది.

భోంచేసి మళ్ళీ ఓ మూల కూర్చున్నారు పిల్లలు.

"పిన్నీ నాకు చీర కట్టవూ ?" గారం పోయాడు నారాయణ. ఓ పాత గుడ్డ ముక్కను కట్టి పమిటలా వేసింది జానకికి.

వాడు దాన్ని సవరించుకొంటూ వీధిలో నవరత్నం పిల్లలను ఎలా టీజ్ చేసేదో కాస్సేపు అభినయించి మరీ చూపెట్టాడు.

చిరునవ్వుతో వాడి అభినయాన్ని చూస్తూ కూర్చుందే కానీ కళ్ళన్నీ గుమ్మం వైపే వున్నాయి జానకికి.

"ఆ నవరత్నం అంటే నాకు ఇష్టం లేదు పిన్నీ.... ఎప్పుడూ నక్కలాగ వీధిలోకి చూస్తూ వుంటుంది"

రవి గొంతులో అసహ్యం ధ్వనించింది.

"పోనీలే బాబూ! ఆవిడ గొడవ మనకెందుకు?" అని అనునయించింది జానకి.

మాట్లాడుతూనే నిద్రకు జోగారు రవి, విజ్జిలు.... వాళ్ళిద్దరినీ పక్కల మీద పడుకోబెట్టి దుప్పటి కప్పింది. నారాయణ చీర విప్పేసి - నిద్రొస్తుందో చ్, అంటూ పారిపోయాడు.

'నారాయణ!.... అలా పరుగు పెట్టకు-నేవచ్చి దిగబెడుతా'' అంటున్నా విన్పించుకోలేదు.

పిల్లలు నిద్రపోయాక ఇల్లంతా నిశ్శబ్ద మావరించింది. గడియారం టిక్కు టిక్కులే పదింతలై విన్పిస్తూంటే గుమ్మానికెదురుగా స్తబ్దంగా కూర్చుంది జానకి.

మనసులో ఇది అని చెప్పరాని అలజడి. ఏమైందీవేళ.... కోతిలాటి మనసుకు ఖాళీ చిక్కకూడదు - అనుకొంటూ లేచి వెళ్ళి పత్రిక తెచ్చుకొని కూర్చుంది.

మధ్య మధ్య గుమ్మంకేసి చూస్తూ కథ చదువసాగింది.

కాలేజీలో చదువుకొనే యువతీ యువకుల ప్రేమగాథ.... గిలిగింతలు పెట్టే విధంగా మలిచాడు రచయిత. అబ్బాయి చిలిపిగా ఏదో అన్నందుకు, అమాంతం దవడ పగుల గొట్టుతుంది అమ్మాయి.... చెంపకు చెయిచేర్చి ఎంత తీయని బహుమతి అంటూ సినీమా డైలాగులు చెప్పేస్తాడు అబ్బాయి. బుసలు కొట్టుతూ వెళ్ళిపోయిన అమ్మాయి, ఇంటికెళ్ళి పక్క మీద పడి భోరున ఏడ్చేస్తుంది. ఆ ఏడ్పు వెల్లువలో తనలోని అహంకారం, ఆవేశం అన్నీ కరిగిపోగా, తనుగా మిగులుతుంది. ఎదలో గిలిగింతలు! తడిమి చూసుకుంటే హృదయ ఫలకం మీద తనను కవ్విస్తూన్న చిలిపి అబ్బాయి....

సిగ్గుగా కళ్లు మూసుకుంటుంది అమ్మాయి. చదవడం ఆపి గోడకు జేరగిలబడి కూర్చొని పైకప్పుకేసి చూస్తూండిపోయింది జానకి.

ఏమిటి ఈ ప్రేమ కథలు?.... ఈ ప్రేమ జాడ్యాన్ని యింత తీయగా వర్ణించిన కవులకు, రచయితలకు ప్రేమ అంటే తెలుసా ?

ప్రేమమైకంలో పడి అప్పుడప్పుడే కనువిప్పి ప్రపంచాన్ని చూచే కన్నె పడుచులకు ఎంతటి సుందరస్వప్నం? జీవితం ఎంతటి రంగులమయం! ఆ ఏడు రంగుల ఇంద్ర చాపముపై ఊయలలూగుతూ స్వప్నసౌఖ్యాన్ని అనుభవిస్తూ....

"జానకీ"

"జానకీ"

ఎవరిదో పిలుపు అతిచేరువలో.... తననే పిలుస్తున్న గొంతు - కల కరిగిపోగా ఉలిక్కిపడి కళ్లు టపటప లాడించింది. తన ఎదుట దుమ్ము కొట్టుకున్న నల్లటిబూటు, గళ్ళపేంటులో టక్ చేసిన తెల్లషర్టు, చెదరిన క్రాపు వెనక్కు పెట్టుకున్న చేతిలో స్టైతస్కోపు.

(ఇంకా వుంది



మార్చి 01, 1989

గుజరాతీలో కెయమ్ మున్షీ, తమిళంలో కల్కి భారతీయత వుట్టి పడేలా చారిత్రక నవలలు సృష్టించిన వారిలో సుప్రసిద్ధులు. కెయమ్ మున్షీ నవలలకు వున్న యావద్భారత ప్రాచుర్యం, కల్కి నవలలకు వుండగల అవకాశం లేదు. తమిళ పాఠకులకి మాత్రమే అవి పరిమితమై ఉన్నాయి - పొరుగు భాషలైన కన్నడ, మళయాళ, తెలుగులలో అవి వచ్చిన జాడ అంతగా కనిపించదు. అయితే, కళా టాకర్ అనే విద్యాధికురాలు - తమిళ గుజరాతీ భాషలు రెండిటిలోనూ పాండిత్యం గల వనిత - ఈ యిరువురు సాహితీవేత్తలలోని అంతర్వాహినిని వివరిస్తూ ఒక చక్కటి గ్రంథం రచించారు.... సి. సుబ్రహ్మణ్య అధ్యక్షతను ఆ గ్రంథావిష్కరణ యివ్వాళ భారతీయ విద్యాభవన్‌లో! వృత్తి రాజకీయాల జోలికి పోని దేశభక్తుడు కెయమ్ మున్షీ; తన కలం ద్వారా పాఠకులలో చారిత్రక చైతన్యాన్ని కలిగించిన మహా రచయిత కల్కి. ఇరువురూ మన ప్రాచీన సంస్కృతినీ, వారసత్వాన్నీ గుర్తు చేసిన మహనీయులే! సి. సుబ్రహ్మణ్యం ఆ పరిశీలనాత్మక గ్రంథాన్ని (వెల: రు. 55-00) విడుదల చేశారు; ప్రథమ ప్రతిని కులపతి బాలకృష్ణ జోషి అందుకున్నారు. చెల్లప్పన్, కల్కి రాజేంద్రన్, రామకృష్ణన్ (భారతీయ విద్యాభవన్ కార్యదర్శి) మున్నగువారు ప్రసంగించారు.

..... 04

1914 లో న్యూ ఆర్లియన్స్‌లోని అమెరికన్ నీగ్రోలు సింపుల్ ఫారమ్ స్ట్రాంగ్ రిథిమ్ (simple form and strong rhythm) గల వాద్య బృందాన్ని (ఇరవైమంది) వ్యాప్తిలోకి తీసుకువచ్చారు - దానినే 'జాజ్ (Jazz) అంటారు. అమెరికన్ ఆర్మీలోని, ఫీల్డ్ బాండ్‌కి (Field Band) చెందిన ఈ 'జాజ్ అంబాసిడర్స్' విభాగం 1969 నుంచీ దేశ దేశాలలో పర్యటిస్తోంది. వీరు 1930 నాటి ట్యూన్స్ నుంచీ, పాప్ మ్యూజిక్, పెట్రియాటిక్ మ్యూజిక్ - అధిక జనాదరణ పొందిన 40 పాటలతో శ్రోతలను ఆనంద పరుస్తారు. ఈ బృందంలోని ప్రతి ఒక్కరూ

శ్రావ్యంగా పాడగలరు; వాద్యాలూ నైపుణ్యంతో పలికించ గలరు. ఎంతో వైవిధ్యం గల ఈ గాన కచ్చేరిలోని సొగసులు, విని ఆనందించ వలసినదేగాని మాటల కందనివి.... రేపు సాయంత్రం మ్యూజిక్ అకాడమీలో (M R F సహకారంతో) వారి ప్రదర్శన ఉంది. అయితే, అయిదారు రోజుల క్రితమే, మద్రాసులోని అమెరికన్ కాన్సల్ జనరల్ మిస్టర్ టింబర్‌మాన్, మిసెస్ టింబర్‌మాన్‌ల వద్ద నుంచి, సాయంత్రం ఆరున్నర నుంచి ఎనిమిది న్నర వరకూ రివర్ హౌస్‌లోని వారి లాన్స్‌లో ఏర్పాటుచేసిన జాజ్ అంబాసిడర్స్ ప్రోగ్రామ్‌కి మాకు ఆహ్వానం వచ్చింది. ఏమైనా లాన్స్‌లో ప్రత్యేకాహ్వానితుల మధ్య వినడం వేరుకద! సాఫ్ట్‌డ్రింక్సూ హాట్‌డ్రింక్సూ అయాక ప్రోగ్రామ్ ప్రారంభమయింది. గాత్రం లోని వేదనామాధురి వివిధ వాద్యాల మధ్య వంతెనలల్లే రాగ లయల ఐక్యతాకృషిలో ఎవరికి వారు తమని తాము మర్చిపోయి, ఒక స్రవంతిలో గాన వీచికలవడం, వీటన్నిటినీ సమ్మేళన పరిచే మాస్టర్— అదంతా ఒక రసమయజగతి. హృదయ గానమూ బృందగానమూ ఒకటికాగా కరతాళ ధ్వనులలో ఆనందాతిరేకం వెల్లువికింది.

## 12

నిన్న సాయంత్రం ఫాల్కీవాలా బడ్జెట్ యనాలిసిస్ విందామని సెంటినరీ హాలుకివెళ్ళి, లోపల ఎక్కడా సీట్లు లేకపోవడంతో, బయట కాసేపు నిలబడి, తను ఎక్కువసేపు నిలబడలేదు గనక వుడ్‌లాండ్స్‌కి వచ్చి. ముప్పయి గంటలు నిద్రలేకుండా ప్రయాణంచేసి కళ్లు మూతలు పడుతున్న యాడమ్స్‌ని (సారాడిక్కీ భర్త - 1987 మార్చి నెల 'డైరీ' లో దాక్షిణాత్య ఫిలిమ్‌కి దిగువతరగతులపై గల ప్రభావం అనే అంశం మీద పిహెచ్‌డి కోసం ఆమె జరిపిన సమాచార సేకరణ, ఆమెని వేర్వేరు ఫిలిమ్ ప్రముఖులకు నేను పరిచయం చేయడం చదివివుంటారు) హాయిగా నిద్రపొమ్మని చెప్పి మర్నాడు మధ్యాహ్నం మా యింటికి ఆంధ్రా భోజనానికి పిలిచి వచ్చాము ఈ యాడమ్స్ చిన్నతనం, గుంటూరు లోను, వూటీలోను గడిచింది. విశాఖపట్నంలో చదువుకున్నాడు. 'జగతి' ప్రతినెలా శ్రద్ధగా చదివే వోవర్‌సీస్ సబ్‌స్క్రయిబర్స్‌లో అయనొకడు. 'జగతి' చదవడం కంటె ముఖ్యం సారాడిక్కీ.... చక్కటి తమిళం మాట్లాడే సారాడిక్కీ అంటే మా యింట్లో అందరికీ ఇష్టం, ఆకారణంగానే ఆమె భర్త.... పప్పు, వంకాయ కూర, ముక్కల పులుసు, ఆవకాయ, అప్పడాలూతో భోజనమయాక, సాంసారిక గొడవలు, టీచింగ్‌లోని యిబ్బందులు, ఇద్దరూ కలిసి ఇండియా రావాలంటే ఎన్నాళ్లు డబ్బు పోగు చేసుకోవలసి వచ్చేదీ యిత్యాదులు చెప్పాడు యాడమ్స్. 'కాంపస్‌లోనే క్వార్టర్స్ అవడంవల్ల, పెట్రోలు ఖర్చు లేదు.

గాని అనుకోని అతిథులు ఎల్లవేళలా తలుపు తడుతూ, మాట్లైము మింగేస్తూ వుంటారు' - అన్నాడు. మాతో ఈ పూట గడిపేందుకే ఆగాననీ, సాయింత్రం వూటీ వెళ్లిపోతున్నాననీ చెప్పాడు. అక్కడ నుంచి బెంగుళూరు వెళ్లి ఫ్లయిట్ తీసుకుంటాడట. ఈ రోజుల్లో స్నేహ బాంధవ్యానికి దేశాలూ ఎల్లలూ లేవు. మనుషులు దూరంగా వున్నకొద్దీ వారి మీద గౌరవమూ ఆప్యాయతా పెరుగుతాయి.

## 16

అమరజీవి పొట్టి శ్రీరాములు జయంతి శ్రీనివాస శాస్త్రి హాలులో, కార్యదర్శి వైయస్ శాస్త్రి స్వాగతం తెలిపాక డా॥ శాంతప్ప అధ్యక్షతను, ఆర్ట్ క్రిటిక్ ఎయస్ రామన్ 'జాతీయ సమైక్యత' పై ప్రసంగించారు. వివిధ ప్రాంతాలలోని ఆచారవ్యవహారాలను, సంప్రదాయాలను, కళా ప్రక్రియలను సచ్చింతనతో స్వీకరించగలిగినప్పుడే, ఇచ్చిపుచ్చుకోవడమనేది పరస్పరం జరిగినప్పుడే సదవగాహన ఏర్పడుతుందన్నారు.... పొట్టి శ్రీరాములు, గాంధీజీని మించిన గాంధేయవాది అని, డా॥ శ్రీరాములు (మార్కాపురం కాలేజీలో పొలిటికల్ సైన్స్ ప్రధానోధ్యాపకులు) అనడం మావంటి వారికంతగా రుచించదు. పొట్టి శ్రీరాములు







అమరణ దీక్ష మద్రాసుతో కూడిన ఆంధ్రరాష్ట్రం కోసమని ఈనాడు ఎందరికి గుర్తువుంది ? (నాకూ తెలీదు - పూజ్యులు గోపాలరెడ్డి గారు చెప్పారా విషయం ఒకసారి.)

. . . . . 18

పదహారో తేదీ సాయింత్రం కాలి నడకని (మరీ అవసరమైతే తప్ప ఆమె కారు వాడరు) కూరల మార్కెట్‌కి వెళ్లి, కూరలు స్వయంగా తెచ్చుకు, తన ఫ్లాట్‌లోకి వచ్చి, సెట్టీమీద నడుం వాల్చి, టివి చూస్తూ నిద్రలోకి జారుకున్నారు - అదే దీర్ఘ నిద్ర కాగలదని ఎవరూ అనుకోలేదు, ఏ జ్యోసుడు చెప్పలేదు. తెల్లారి లేచేసరికి తనకు పళ్లరసం అందించే భార్య, యింకా ఎందుకు తీసుకురాలేదా అని దగ్గర కొచ్చి, నిద్రలేపేందుకు చేయి తాకిన భర్తకు, చుట్టూ ప్రపంచం కూలిపోయినట్లనిపించింది. అరవై అరవై అయిదేళ్లపాటు తనతో ప్రయాణంచేసి, తన కష్టసుఖాలు పంచుకు, ఎంతటి ఐశ్వర్యంలోను తన వ్యక్తిత్వమూ విశ్వాసాలూ విడనాడని అర్ధాంగి, యింత అకస్మాత్తుగా తెర మరుగవడమా ? తనని ఒంటరివాణ్ణి చేసి వెళ్లిపోవడమా ? .... 'కాతే కాంతా కస్తే పుత్ర - స్యంసారో యమతీవ విచిత్రంః' అని ఆదిశంకరులు అన్నప్పటికీ దానిని అన్వయించుకో గలగటం అంత సులువా ? బాధపడక తప్పదు. వేదనా సాంద్రంలో మునకలు వేయకతప్పదు, అంత రంగ మథనంతో కుంగిపోక తప్పదు. అయితే, కాలమూర్తి నేనున్నానంటూ కన్నీళ్లు తుడుస్తాడు నెమ్మది నెమ్మదిగా .... నిన్నరాత్రి సౌందర్యా మనోహరమ్మ గారి (మిసెస్ యల్విప్రసాద్) భౌతిక కాయాన్ని గాంధీనగర్ యింటికి చేర్చారు : ఈ ఉదయం ఆమె అంత్యక్రియలు యథావిధిగా జరిపించారు.... పంచభూతాలలో కలిసిపోయిన ఆ పుణ్యాత్మురాలి గురించి వినడమే తప్ప ఆమెని చూసే అదృష్టంగాని, మాట్లాడే అవకాశంగాని మాకు కలగలేదు. చాలా చాలా సంవత్సరాల క్రితం మాలతి ఒకసారి ఆమెతో ఏలూరు నుంచి మద్రాసు ప్రయాణం చేసిందట - ఇక్ష్వాకుల కాలంనాటి మాట అది.... పెద్దలు పూజ్యులు యల్విప్రసాద్‌గారికి, వారి అబ్బాయికి, అమ్మాయికి మిగతా కుటుంబ సభ్యులందరికీ మా హృదయ పూర్వక సానుభూతి.

. . . . . 19

చదలవాడ తిరుపతిరావు అనూరాధా ఫిలిమ్స్ డివిజన్ తరఫున సమర్పిస్తున్న 'లైలా' ఒక ప్రణయోదంత చిత్రం. పాటలన్నీ నారాయణరెడ్డివీ, మ్యూజిక్ యమ్మెస్ విశ్వనాథ్‌దీ అయినప్పుడు, చిత్రమింకా విడుదల గాక పోయినా, కాసెట్‌ని సినీ అభిమానులు (యివ్వాళ్టికి నాలుగు వేల చిల్లర ఖర్చయాయట) ఆదరించడంలో ఆశ్చర్యం లేదు. 'కదిలే మేఘమా' (బాలు) అని నాయకుడు తన మనోహరిని తలుచుకోగా 'ఒకొక్క చినుకు' (బాలు - జానకి') అంటూ వర్షధారలో తడిసి

పులకితులవుతారు ప్రేయసీ ప్రియులు. సృష్టికి మూలం ప్రేమ' బాలు, సుశీల పాడగా, 'గగన సాక్షిగా' 'ఎదురుగ 'నీవుంటే', అని బాలు - జానకి పాడ తారు. 'లైలా ఓ లైలా' జేసుదాసుది .... హీరో : సురేష్ ; నిర్మాత : చదల వాడ శ్రీనివాసరావు ; దర్శకత్వం : ఐ రామారావు .... 'లియో' ఆడియో - విడియోవారు (44 పాండీ బజారు, మద్రాసు - 17) ఈ కాసెట్‌ని విడుదల చేశారు. వెల : రు. 23 - 00 .... పాటల ప్రదర్శనానంతరం లాంఛన ప్రాయ మైన మీటింగు జరిగింది. ఆత్రేయ, యమ్మెస్ విశ్వనాథ్, బాలయ్య మున్నగువారు వక్తలు.... ఇతర పనులు వుండటంవల్ల మధ్యలో వచ్చేయవలసి వచ్చింది .... పి ఆర్ ఓ : అర్జునరావు.

## 22

మద్రాసు తెలుగు అకాడమీ ఏప్రిల్ 9వ తేదీన మ్యూజిక్ అకాడమీ లో జరుపనున్న ఉగాది పురస్కారం గురించి పాత్రికేయులకు తెలిపే నిమిత్తం వుడ్‌లాండ్స్‌లో ప్రెస్‌మీట్ .... క్రితం సంవత్సరం రెండు నిము షాలు ఆలస్యం అయింది ; అంచేత, ఈ ఏడు ఇరవై నిముషాలు ముందుగా వచ్చాను. 'వెల్‌కమ్' అంటూ నిర్మల మైన నవ్వుతో రెండు చేతులూ బాచి ఆహ్వానించారు శాస్త్రిగారు. నేనే ఫస్ట్‌ని వచ్చాననుకున్నా కాని, నాకంటె అయిదు నిముషాలు ముందు వచ్చి వున్నారు ఆంధ్రప్రభ దత్తు.... యుగాది పురస్కార లిస్టుతో బాటు, కనువిందైె ఇంటికి నిండుతనమిచ్చే నిప్పో, డయొనారా కాలెండర్లు పట్టు కెళ్తారు పాత్రికేయులు యివ్వాళ. తరణి కుంచెలో వినాయకుని వివిధ భంగిమలు డయొనారా (టివి) చూపగా, సుందరీమణుల శరీర సౌష్టవంలోని వెలుగు రేఖలు విర జిమ్ముతుంది నిప్పో (బాటరీలు) ఈ రెండూ మద్రాసు తెలుగు అకాడమీ అధ్యక్షులు ఓబుల్ రెడ్డిగారి కాంప్లి మెంట్స్‌తో ! .... మీటింగ్‌కి ముందు ఒక పక్కగా కూచున్నప్పుడు, మస్కాట్ లో తను చూసిన బంగారు బాత్ టబ్ గురించి చెప్పారు బాలమురళి. 'కచ్చేరి అయిపోయాక వెంటనే బయలు దేరాలనిపిస్తుంది - కాని, ఈ మస్కాట్ లో మాత్రం మూడు రోజులు అద నంగా వుండిపోయాను. ఆ శుచి శుభ్ర తలు, ఆ ఐశ్వర్యమూ మన ఊహ కందనవి' అన్నారాయన.... కార్య దర్శి రావికొండలరావు స్వాగత వచ నం, ఉపాధ్యక్షులు బాలమురళీ కృష్ణ ప్రసంగం తర్వాత, ఛీఫ్ కన్వీనరు టివికె శాస్త్రి లిస్టు చదివారు. కాపీలు (ఇంగ్లీషువి, తెలుగువి) అప్పటికే పత్రికలవారికి పంచడమైపోయింది .... ఈ సంవత్సరం ఇండియన్ సినిమా ప్లాటినమ్ జూబిలీ గనక సినిమావారికి కొంచెం ఎక్కువగా ప్రాముఖ్యం యివ్వ డం జరిగింది.... అకాడమీ ఇచ్చేవి పన్నెండు అవార్డులు మాత్రమే ; కాని, మరొక దిపహేనూ పద్దెనిమిది దాకా ఇతరులు స్పాన్సర్ చేస్తారు. అకాడమీ

పురస్కార గ్రహీతులు : 1. భరతనాట్య కళాకారిణి అలిమేల్‌వల్లి ; 2. ఎవి యమ్ శరవణన్ ; 3. పట్టువస్త్రాల వ్యాపారవేత్త నల్లి కుప్పుస్వామి చెట్టి ; 4. సినీనటుడు రజనీకాంత్ ; 5. సినీ నటి జయప్రద ; 6. ఎక్స్‌ప్రెస్ న్యూస్ పేపర్స్ సరోజ్ గోయంకా ; 7. జర్నలిస్ట్ మెయిల్ రామారావు ; జమీన్ రైతు - శ్రీరామ్మూర్తి ; 8. ప్లేబాక్ సౌందరరాజన్ ; 9. ప్లాస్టిక్ సర్జన్ డాక్టర్ వెంకటస్వామి ; 10. కెమికల్ టెక్నాలజిస్ట్ ప్రొఫెసర్ చిరంజీవి ; 11. ఇండియన్ బాంక్ ఛెయిర్‌మాన్ గోపాలకృష్ణన్; 12. 'స్వర్ణకమలాల' ఇల్లిందల సరస్వతీదేవి.... మిగతావి ఎవరికంటే; 1. యమ్ బాలమురళీకృష్ణ; 2. అక్కినేని నాగేశ్వరరావు; 3. సత్య నారాయణమూర్తి - వెంకట సీతమ్మ ; 4. కెవి మహాదేవన్; 5. యస్పి బాల సుబ్రహ్మణ్యం ; 6. ఉస్తాద్ అహ్మద్ హుసేన్‌ఖాన్ ; 7. జంధ్యాల ; 8. వాణిశ్రీ; 9. ఆర్‌కె రావు; 10. నగ్నముని ; 11. గుమ్మడి వెంకటేశ్వరరావు; 12. కమలహాసన్ ; 13 రాళ్లపల్లి ; 14. అమరావు సత్యనారాయణ ; 15. ఎయమ్ రాజా ; 16. ఆనంద్; 17. గరిమెళ్ల రామమూర్తి ; 18. జోగులాంబ. ఈ పద్దెనిమిది మొదటి 15 ఎవరి పేరు మీద ఎవరు యిస్తున్నారు, లేక, యిప్పిస్తున్నారు. అంటే : 1. త్యాగరాజు పేరుమీద పి ఓబుల్‌రెడ్డి; 2. పి పుల్లయ్య పేరు మీద శాంతకుమారి ; 3. ద్వారం వెంకట స్వామినాయుడు పేరు మీద ఉమ్మిడి శ్రీహరి ; 4. కోదండపాణి పురస్కారం యస్పి ; 5. పెండ్యాల.... యస్ జానకి ; 6. సుబ్బమాంబ.... బాలమురళీ ; 7. బియన్ రెడ్డి .... చంద్రమోహన్ ; 8. గాలి బాలసుందరరావు .... జలంధర ; 9. రాజారావు .... సూర్యకాంతం ; 10. శ్రీశ్రీ.... ఆరుద్ర ; 11. నాగయ్య .... వి మోహనరావు ; 12. యస్వి రంగారావు.... ఆర్‌వి జికె రంగారావు ; 13. రేలంగి .... 'చందమామ' విశ్వనాథ రెడ్డి ; 14. బళ్ళారి పురస్కారం రమణయ్యరాజా ; 15. ఘంటసాల పురస్కారం యస్ రాజేశ్వరరావు .... కొంచెం ఓపికగా రెండులిస్టులూ సరిచూసుకుంటే, ఎవరు ఎవరికి ఎవరి పేరు మీద అవార్డ్ యిస్తున్నదీ తెలుస్తుంది ... ఏప్రిల్ తొమ్మిదో తేదీ మూడున్నరకి మ్యూజిక్ అకాడమీలో ప్రారంభమయే ఉత్సవానికి తమిళనాడు గవర్నరు అలెగ్జాండర్ ముఖ్య అతిధి ; అక్కినేని నాగేశ్వరరావు సభా ప్రారంభకులు ; రిచ్‌మన్ గ్రూప్ 'యమ్‌డి' జి విఠల్ - స్వరాజ మజ్దా 'జియమ్' కె భగవతీప్రసాద్ - ఈ యిరువురు ప్రత్యేక అతిధులు.... మిగతా విశేషాలు ఏప్రిల్ తొమ్మిదిన.

. . . . . 23

"రచనల ద్వారా, రచనా ప్రబోధం ద్వారా నవసమాజం నిర్మితం కాదు - ఉద్యమాల ద్వారా అది జరుగుతోంది. ఉద్యమ మనేది చారిత్రక పరిణామంలో ఒక ఘట్టం - సమాజంలోని మిట్ట పల్లాలను కొంత

మేర సరిదిద్దుతుంది. ఆ ప్రజా చైతన్యానికి ఉత్తేజ మివ్వడం దాకానే సాహితీకారుడు చేయగలడు. కవితా వేశనినాదాల నుంచి విప్లవం జనించదు. కవి, రచయిత, సాహితీవేత్త తమ కలంలో నుంచి సామాజిక స్వరూపం చూపగలుగుతారు; పాఠకులని ఆలోచనాపరులు చేయగలుగుతారు" - అన్నారు, ఓనమాలు, రథచక్రాలు వంటి గొప్ప నవలలు రాసిన మిత్రులు మహీధర రామ్మోహనరావు, పొట్టి శ్రీరాములు హాలులో, అభ్యుదయ రచయితల సంఘం ఏర్పరిచిన ఇష్టాగోష్టి సందర్భంగా! ఆత్మాశ్రయ కవితా ఘోష అధికమవుతున్న రోజులలో, మహీధర వారి మాటలు, మండుటెండలోని మలయపవనాలు.

. . . . . 27

లాస్ ఏంజిలిస్‌లో జరిగే 'ఆస్కార్' ఉత్సవానికి, దక్షిణ భారతం నుంచి ఆహ్వానితునిగా వెళ్తున్న చిరంజీవికి 'బాన్ వోయేజ్' చెప్పే నిమిత్తం (ఈరాత్రే వెళ్తున్నారు), వడ్డె రమేష్ నిర్మిస్తున్న 'లంకేశ్వరుడు' సెట్‌మీద (మురుగాలయ) ప్రెస్‌మీట్ - మిట్ట మధ్యాహ్నం పన్నెండున్నరకి! .... నిర్మాణ వివరాలయాక, వర్క్‌లోకి వెళ్లబోతున్న చిరంజీవిని గ్రీట్‌చేసి, బయలు దేరబోతూండగా మరొక్క రెండు నిముషాలు - అన్నారు .... అపూర్వ కళాకారుడూ నిరంతర పథికుడూ అవడంవల్ల దాసరి నారాయణ రావు మాటలలో ఎప్పటికప్పుడు నవ్యత కనిపిస్తుంది. మిగతా విషయాలయాక హీరో గురించి ప్రస్తావిస్తూ "చిరంజీవి తను ధరించే పాత్రలో తాదాత్మ్యం పొందగలడు. ఇంకా బాగా మెప్పించాలి - అనే తపనలో సాధనలో అతనికి సాటి మరొకటి కనిపించదు.... తన పాత్ర పోషణలో పూర్తిగా నిమగ్నం కాగలగడం అతని ప్రత్యేకత" - అన్నారు దాసరి .... లంచ్‌కి వుండమని బలవంత పెట్టారు గాని యింటికి వస్తానని చెప్పడంచేత వుండలేకపోయాను.... పి. ఆర్‌ఒ : రామారావు.

. . . . . 28

అన్నా యూనివర్సిటీ వైస్ - ఛాన్సలర్ డా॥ విసి కొళందైస్వామి 'వజహమ్ - వళ్లువమ్' గ్రంథానికి, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు లభించిన సందర్భంగా, భారతీయ విద్యా భవన్‌లో తమిళనాడు గవర్నరు అలెగ్జాండర్ అధ్యక్షతను అభినందన సభ.... ప్రార్థనా నంతరం సి సుబ్రహ్మణ్యం ఆహూతులకు స్వాగతం తెలిపారు. అభినందన ప్రసంగాలు చేసినవారిలో శివజ్ఞాన గ్రామణి, మద్రాసు యూనివర్సిటీ వైస్‌ఛాన్సలర్ జ్ఞానమ్, ప్రొఫెసరు జ్ఞానసంబందం, సౌందర్యా కైలాసమ్ డి. అంజనేయులుతో బాటు తమిళనాడు అసెంబ్లీ స్పీకరు తమిళ కుడిమగన్, మోచేతికి బాండేజితో (మార్చి 25 రభస ఫలితం) కుమారి అనందన్ ఉండటం ఒక విశేషం. రాజకీయాలలో వైరం గాని, సాహి

త్యంలో ఒకే వేదిక. ఇరువురూ చక్కటి మాటకారులు. మొత్తంమీద ప్రతి ఒక్కరూ వళ్లువార్ గురించీ, ప్రసంగ వశాన దార్లే సమకాలీన స్థితిగతుల గురించీ సర్వజనా మోదంగా చెప్పారు. యస్వీ నరసింహం (మైలాపూర్ అకాడమీ అధ్యక్షులు) వందన సమర్పణ గావించారు .... కొళందైస్వామి 'వళ్లువర్' గురించి ఇంగ్లీషులో వ్రాయనున్నారు - అది తొందరలోనే వెలువడుతుంది.

. . . . . 29

నిర్మాత ఏడిద నాగేశ్వర్రావు, వారి అబ్బాయి శ్రీరామ్‌ని, తమ పిక్చర్లో హీరోగా పరిచయం చేస్తున్నారు. ఈ ప్రొడక్షన్‌కి దర్శకులు వంశీ.... చల్ల బాటు వేళ పూర్ణోదయా డాబా మీద పాటలు వినిపించారు.... దర్శకులు విశ్వనాథ్ నూతన ప్రవేశకుని ఆశీర్వదించారు. శ్రీరామ్ ఉత్తమ కళాకారునిగా గుర్తింపు నొందాలని అభిలషిస్తున్నాము. పిఆర్ఒ : అర్జునరావు.

ఏప్రిల్ 01, 1989

పొట్టి శ్రీరాములు హాలులో జరిగిన 'విష్ణు సహస్రనామస్తోత్ర' గ్రంథావిష్కరణకు, బాలమురళీ కృష్ణ ముఖ్య అతిథి. వావిళ్ల వారి భాషా సేవ గురించి పప్పు వేణుగోపాలరావు, గ్రంథ ప్రాశస్త్యం గురించి గోడా వేంకటేశ్వరశాస్త్రి ఉపన్యసించారు. మనశ్శాంతికి దోహదకారి అయే ఏ సహస్రనామార్చన గురించి అయినా చెప్పేందుకేముంటుంది? అది పూర్తిగా వ్యక్తిగతం, వ్యక్తి అభీష్టం.

. . . . . 02

కళాసాగర్ అవార్డుల వివరాలు తెలిపేందుకు, ఈ సాయంత్రం వారి ఆఫీసులో ప్రెస్‌మీట్. కళాసాగర్ సభ్యులు బాలెట్ ఫలితాలు సేకరించిన

మీాదట, ముగ్గురు న్యాయ నిర్ణేతలు వాటిని పరిశీలించి తుది నిర్ణయం తీసుకున్నారు. ఆ ముగ్గురు న్యాయనిర్ణేతలు ఎవరనగా : సుప్రసిద్ధ డైరక్టర్ సియస్ రావు; నెల్లూరు 'నర్తకి' థియేటర్ వోనరు జనార్దనరెడ్డి; పారిశ్రామికవేత్త సుధాకర్, కళాసాగర్ అధ్యక్షులు యమ్మెస్ రెడ్డి సభా నిర్వహణ గావించారు. ఉత్తమ చిత్రం : కళ్లు; ఉత్తమ డైరక్టర్ : యమ్వి రఘు (కళ్లు); యాక్టర్ : చిరంజీవి - రుద్రవీణ; యాక్ట్రెస్ : భానుప్రియ - స్వర్ణకమలం; స్పెషల్గా : సీత - న్యాయంకోసం; కారెక్టర్ యాక్టర్ : నూతన ప్రసాద్ - నవభారతం; సపోర్టింగ్ యాక్టర్ : రఘువరన్ - కాంచనసీత; సపోర్టింగ్ యాక్ట్రెస్ : సుధారాణి - కళ్లు; హాస్య నటుడు : సంజీవి - నవభారతం; స్పెషల్గా : చిదంబరం - కళ్లు; హాస్యనటి : శ్రీలక్ష్మి - స్వర్ణకమలం; యంగ్ టాలెంట్ : మహేష్బాబు - ముగ్గురు కొడుకులు; ఉత్తమకథ : నవభారతం; సంభాషణలు : యమ్ రాజా - నవభారతం; గేయ రచయిత : ఆత్రేయ - అభినందన; ప్లేబాక్ : బాలు - అభినందన; లేడీ ప్లేబాక్; లతా మంగేష్కర్ - ఆఖరి పోరాటం; మ్యూజిక్ డైరక్టర్ : మహాదేవన్ - జానకిరాముడు; కెమెరా : లోక్సింగ్ - మరణ మృదంగం; నిర్మాత : అర్వి రమణ మూర్తి - అభినందన : తెలుగు చిత్ర పరిశ్రమలోని విశిష్టవ్యక్తి : దాసరి నారాయణరావు.... 1989 జూన్ నెలాఖరున వార్షికోత్సవం, బహుమతి ప్రదానం జరుగవచ్చు.

. . . . . 03

ఆలిండియా రేడియో మద్రాసు కేంద్రం, యుగాది కవి సమ్మేళనం (తెలుగు), ఈ సాయింత్రం ఆరు గంటలకు ఆహూతుల సమక్షంలో నిర్వహించింది. స్టేషన్ డైరక్టరు వేణుగోపాలరెడ్డి స్వాగతం తెలిపారు; అసిస్టెంట్ స్టేషన్ డైరక్టరు దుర్గాభాస్కర్ పరిచయ వాక్యాలు చెప్పారు. గౌరి ప్రోగ్రామ్ అనౌన్స్ చేశారు.... రేడియో తాతయ్యని (మల్లంపల్లి సోమశేఖరశర్మగారి సోదరుడు ఉమామహేశ్వరరావు) చూడగానే ఎన్నో జ్ఞాపకాలు గిర్రున తిరిగాయి. 'మా పాదినేది ?' అంటూ పల్కరించే రేడియో భానుమతి.... యిలా ఎందరో! మార్షల్స్ రోడ్లో రేడియో స్టేషన్ వుండగా, ఆ రోజులూ, ఆ అనుబంధాలూ, ఆ కలుపుగోలుతనం, ప్రతిభని, ప్రత్యేకతని వెతికి పట్టుకోవడం - అది నాస్టాల్జియా కాదు - చిన్నదిగా, పరిమితంగా ఉండేనాటి అవకాశాలు, విస్తృతమైన కొద్దీ అరుదవడం సహజం.... కవి సమ్మేళనలో ప్రతి ఒక్కరి కవితాగానం, తమదైన బాణీలో రసజ్ఞులని అలరించింది. ఇదే ప్రోగ్రామ్ యుగాది ఉదయం ప్రసారమవుతుంది. ఆరుద్ర, ఏల్చూరి, గొల్లపూడి మారుతీరావు, గోపి, యామిజాల, మల్లిక్, మొగలి శివప్రసాద్,

సరోజనీ ప్రేమ్‌చంద్ మున్నగువారు ఈ ప్రత్యేక కార్యక్రమంలో పాల్గొన్నారు.

. . . . . 07

శాస్త్రి గోఖలె హాలులో, నోరి శ్రీనాథ వెంకట సోమయాజ విరచిత 'బ్రహ్మ సూత్ర దర్శనము' గ్రంథాన్ని స్వామీ అమృతానందజీ మహరాజ్ ఆవిష్కరించారు. కంపీర్ చేసిన పప్పు వేణుగోపాలరావు, పనిలో పనిగా 'పంచాంగ శ్రవణం' చెప్పారు. ఆధ్యాత్మిక సాధనలోని సప్తవిధ చైతన్య భూమికలు, సప్తవిధ జ్ఞాన భేదికలు గురించి షడ్దర్శనముల దృష్ట్యా వివరించారు గ్రంథ పరిచయ కర్త సాళ్వ కృష్ణమూర్తి. సనాతన అనగా పాతది అని కాదు - శాశ్వతమైనది - అని అర్థం. నోరి సూర్యనారాయణ ఛారిటబుల్ ట్రస్ట్ (2 రామన్ వీధి, మద్రాసు - 17.... మేనేజింగ్ ట్రస్టీ: యన్ రామకృష్ణయ్య) ఈ గ్రంథాన్ని ప్రచురించారు.

09

మొదటి నాలుగైదు వరసలూ తప్ప మ్యూజిక్ అకాడమీలోని కింద సీట్లూ, బాల్కనీలో పైనున్నవీ అన్నీ రెండున్నరకే నిండిపోయాయి. ఒంటి గంట నుంచీ జనం రావడం మొదలెట్టారుగాని రెండున్నరదాకా అతి కష్టం మీద ఆడిటోరియమ్ ద్వారాలు తెరవకుండా ఆపగలిగారు. తలుపులు తెరవడమేమిటి, హాలు నిండిపోవడమేమిటి! ద్వారాలు లోపల నుంచి మూసేశారు - ఆఖరికి 'విఐపి' ఎంట్రన్స్ కూడా! ఇలాటి సందర్భాలలో అల్లరి జరగకుండా కూడగట్టుకు రావడమనేది నేర్పుతో కూడిన విద్య – ఆ విద్యలో శాస్త్రిగారు అఖండులు. మిగతా తారలతో బాటు రజనీకాంత్, కమలహాసన్, జయప్రద వస్తున్నారాయె - అందుకనే యింత క్రవుడ్. సాంస్కృతిక ప్రదర్శనలకంటె ఆకర్షణీయమైనది తారల ముఖదర్శనం. ఆ గ్లామర్‌ని అంటిపెట్టుకొనే, ఫిలిమ్ పరిశ్రమ మూడుపువ్వులూ ఆరుకాయలుగా వెలుగొందుతోంది.... మద్రాసు తెలుగు అకాడమీ వారి ఉగాది ఉత్సవం పళనిస్వామి నాదస్వరంతో ప్రారంభమయింది. ఉత్సవ వివరాలు రావి కొండల్రావు చెప్పాక, పద్మా సుబ్రహ్మణ్యం 'అగ్నిధ్యానమ్' (దీపారాధన) చేశారు. పంచాంగశ్రవణం, ఉద్యోగ విజయాలలోని పద్యపఠనం (కృష్ణుని సహాయ మర్థించడానికి అర్జునుడు, దుర్యోధనుడు వచ్చివున్న సందర్భం), తర్వాత ఉమామురళీకృష్ణ భరతనాట్యం ; రాళ్లపల్లి మూకాభినయం ; గొల్లపూడి మారుతీరావు గిరీశం వేషధారణ.... జంధ్యాల రూపొందించిన హాస్యరూపకం ప్రేక్షకులని నవ్వుల నౌకలో ప్రయాణింపజేసింది - సూర్యకాంతం, రావికొండలరావు, రాధాకుమారి, సాక్షిరంగారావు, కోటశ్రీనివాసరావు, మురళీమోహన్, హొట్టిప్రసాద్, బ్రహ్మానందం, శ్రీలక్ష్మి, చిట్టిబాబు, పద్మనాభం, సుత్తివేలు

మొదలైనవారు ఈ హాస్యవల్లరిలో పాల్గొన్నారు....ప్రముఖులు వేదికమీద ఆశీసులయాక, ఛీప్ కన్వీనరు టివికె శాస్త్రి, 'మద్రాసు తెలుగు అకాడమీ జాతీయసమైక్యతా కృషిలో వహిస్తున్న యితోధిక పాత్రగురించి వివరించారు. అక్కినేని నాగేశ్వరరావు ప్రారంభోపన్యాసంతో పురస్కార కార్యక్రమం మొదలయింది. సన్మానితుల గురించి 'డైరీ'లో (మార్చి 22) చదివి ఉంటారు. అన్నీ ఒక ఎత్తు, వృద్ధ దంపతుల కళ్యాణం ఒకటీ ఒక ఎత్తు. సత్యనారాయణమూర్తికి నూటొక్క సంవత్సరాలు ; వెంకట సీతమ్మకు తొంభయినాలుగు - గత ఏభై అరవై ఏళ్లుగా ఈ దంపతులు తమ స్వగ్రామంలో (కోనసీమ) త్యాగరాయ ఉత్సవాలు జరుపుతున్నారు. ఎనభై అయిదేళ్ల క్రితం ఈ దంపతులకు ఇదే ఏప్రిల్ తొమ్మిదో తేదీన వివాహమయింది. వా ప్లేబాక్ జానకి హారతిపట్టగా, వేదపండితులు వివాహ మంత్రాలు చదవగా, తమిళనాడు గవర్నరు దంపతులు, పారిశ్రామికవేత్త ఓబుల్‌రెడ్డి, అపొల్లో పిసి రెడ్డి, ఆంధ్ర సమాచార మంత్రి వివేకానంద మున్నగు ఎందరో విస్మయానందంతో వీక్షిస్తూండగా, ఆ పూజ్య దంపతులకు తిరిగీ వివాహం జరిపించారు, మ్యూజిక్ అకాడమీ వేదిక మీద ! ఏ ఒక్కరు మర్చిపోలేని మహదానంద దృశ్యమది - ప్రతి గుండెలోను సన్నగా పలికే సన్నాయిపాట. పోయిన సంవత్సరం అలెగ్జాండరుచేత బర్త్‌డేకేక్ కోయించారు ; ఈ సంవత్సరం కోనసీమ వృద్ధ దంపతుల కళ్యాణరాగం.

. . . . . 10

అమరజీవి పొట్టిశ్రీరాములు మెమోరియల్ సొసైటీ జరిపే శుక్లనామ సంవత్సర ఉగాది ఉత్సవాలకు, ఇల్లిందల సరస్వతీదేవి ముఖ్యఅతిథి. అధ్యక్షులు: రామలక్ష్మి ఆరుద్ర కథానికా రచయిత్రిగా నలభైల నుంచీ, దక్కన్ రేడియో రోజుల నుంచీ పేరెన్నికగన్న సరస్వతీదేవిని సభకు పరిచయం చేశారు మాలతీచందూర్. రచయిత్రులలో వివాదాలు పొసగకుండా ఎటువంటి సౌమ్యతతో ఆమె సరిదిద్దేవారో చెప్పారు రామలక్ష్మి ఆరుద్ర. సరోజినీ ప్రేమ్‌చంద్, ప్రొఫెసర్ లలిత ఆమె కథల్లోని ప్రత్యేకతను సోదాహరణంగా పేర్కొన్నారు. ఆ నాటి నైజామ్ సంస్థానంలోని స్థితిగతులు, విద్యావంతులైన స్త్రీలు సైతం వీధిలోకి వెళ్లలేక పోవడం, కవిత్వం రాయాలని భర్తగారు అనుకొంటే తను కథలు రాయడం, తెలుగులో వెలువడ్డ కథలన్నీ తను చిన్ననాడే చదవటం, ఆంధ్రప్రదేశ్ అంటూ ఏర్పడ్డాక ఆంధ్రా తెలంగాణా వైషమ్యాలు, రాష్ట్రంలోకంటె రాష్ట్రం వెలుపల ఆంధ్రుల ఐక్యత అధికంగా ఉండటం యిత్యాది విషయాలు ముచ్చటించారు ఇల్లిందల సరస్వతీదేవి. బియస్సార్ కృష్ణ వందన సమర్పణ....

—యన్నార్ చందూర్

## 1776 జులై - ఆ నాలుగు రోజులు

# స్వాతంత్ర్య పత్రం

1776 జులై రెండో తేదిన జరుగుతున్న తర్జన భర్జనలు. పదమూడు రాష్ట్రాలూ పితృదేశమైన బ్రిటన్ నుంచి విడిపోవడానికి సిద్ధంగా ఉన్నాయి. స్వాతంత్ర్య తీర్మానం ప్రతినిధుల సభలో ఏకగ్రీవ ఆమోదం పొందవలసి వుంది.... ఇక చదవండి

బోస్టన్ విమోచన పొందినదన్న వార్త ఫిలడల్ఫియాకి, ఆ సంఘటన జరిగిన వారం రోజులకు తెలిసింది. కాంగ్రెస్‌లోని అతివాదులకీ వార్త ఎంతో సంతోషకరంగా వుంది. కాని తామిప్పుడు మధ్యరాష్ట్రాల గురించి జాగ్రత్తగా ఆలోచించాలి. మధ్య రాష్ట్రావాసు లెప్పుడూ ఓర్పుతో ఆలోచించ గలవారు. బోస్టన్ విజయాన్ని కెనడా నుంచి వచ్చిన దుర్వార్తలతో సరిపెట్టుకోవచ్చు. ఏప్రిల్ నాటికి జనరల్ వాషింగ్టన్ తన సేనలు న్యూయార్క్ రేవు వైపుగా నడిపిస్తున్నాడు. బ్రిటన్ నుంచి బ్రహ్మాండమైన నౌకాదళం వస్తోంది, న్యూయార్క్‌ని వశపరచుకునేందుకు.

భార్యకు ఇలా వ్రాసాడు జాన్ యాడమ్స్ : "టామ్ పెయిన్ కామన్ సెన్సు గురించి ఇక్కడివాళ్ళు ఏమనుకుంటున్నారని కదా నీప్రశ్న విజ్ఞాన దృష్టి గలవారు ఇందులో కొన్ని ఉత్తమ సిద్ధాంతాలు వున్నాయనీ, దురభిప్రాయాలు, మూఢనమ్మకాలపై తిరుగుబాటు వున్నదనీ అంటున్నారు. హేతుజ్ఞానము మాట అటుంచి, యిది ముఖ్యముగా ప్రచారోద్దేశం కలది అంటున్నారు. ఏమైతేనేం మొత్తంమీద అందరు. దీని విషయమై ఆలోచిస్తున్నారు టామ్‌పెయిన్ స్పష్టంగా వంకరటింకరలు లేకుండా సూటిమాటలతో సులభశైలిలో కొన్ని ముఖ్యవిషయాలు నిర్భయముగా చెప్పాడని ఒప్పుకుంటున్నారు. ఈ లేఖకుడు మేడని కూలగొట్టడ మెలాగో చెపుతున్నాడు. అంతేతప్ప మేడని కట్టే పద్ధతి చెప్పడము లేదు - అనామకంగా వెలువడ్డ ఈ కరపత్రము నేను రాశానని ఐరోపా ఖండంలో ప్రచారము చేయబడుతోంది. గొడ్డలిపెట్టులాటి ఈ సునిశితశైలిలో రాయగల సమర్థత నాకు లేదు. కాని అటువంటిది నేనె వ్రాయడం తటస్థిస్తే నిర్మాణాత్మకముగా - వ్రాసి, వుందును, శిల్పిగా దానిని చిత్రించి వుందును. ఈ కరపత్ర లేఖకుడికి రాజ్యాంగ ప్రణాళిక ఎలా తయారు చేయాలో ఈ రాష్ట్రాలన్నిటినీ కలిపి సమాఖ్య ఎలా ఏర్పాటు చేయాలో సిద్ధాంతాల విషయమై ఏకీభవించిన మిత్రులే ఆచరణలో స్వలాభాలవద్ద ఎలా పెనుగులాడుతారో

ఇటువంటి ప్రత్యక్ష సత్యాలతోపరిచయము లేదు"

ఎబిగైల్ భర్తని సూటిగా ప్రశ్నలు అడిగేది: "మనమిప్పుడు బ్రిటన్ నుంచి విడిపోతే - ఈ సంపాదించుకున్న స్వాతంత్ర్యానికి ముప్పం లేకుండా, ఏ రీతిని పరిపాలింపబడతాము ?"

ఈ ప్రశ్న ఎబిగైలే కాదు - కాంగ్రెస్ సభలోని ప్రతినిధులనేక మంది అడుగుతున్నారు. ప్రతి రాష్ట్రమూ తన పాలనా విధానాన్ని, ప్రభుత్వాన్ని ఏర్పరచుకొని ఆపైన అందరూ కలిసి ఒక ఒప్పందానికి రావాలని యాడమ్స్ అంటున్నాడు. ప్రాథమిక హక్కులకూ స్వాతంత్ర్యానికీ సంబంధించిన వాటి లోనే కేంద్రానికి సర్వాధికారాలు వుంటాయి. మే 17 వ తేదీనే యాడమ్స్ ఒక కొత్త తీర్మానానికి ప్రారంభ వాక్యం వ్రాస్తూ, వలసలు ఆంగ్ల రాజుకు విధేయంగా వుండటమనే క్లాజు తీసివేశాడు. మితవాదులు అభ్యంతరము తెలిపారు. తీర్మానము వోటింగ్‌కి పెట్టగా ఏడు గురు సుముఖంగాను, అయిదుగురు వ్యతిరేకముగాను ఓటుచేశారు. మేరీ లాండ్ తటస్థంగా వుంది.

జూన్ 7 వ తేదీ శుక్రవారము నాడు వర్జీనియా రాష్ట్రవాసి రిచర్డ్ హెన్రీ లీ తన తీర్మానాన్ని ప్రవేశ పెట్టాడు. జూన్ 28 వ తేదీ శుక్ర వారము నాడు స్వాతంత్ర్య పత్రము ముసాయిదా ప్రతి, కాంగ్రెస్ సభవారి ముందు వుంచబడింది. శక్తులనీ వ్యక్తులనీ ఏకోన్ముఖముగా చేసి ప్రజల భవిష్యత్తుని మార్చడానికి సంకల్పుడైనాడు

## ముఖచిత్రం

ధవళేశ్వరంలో టీచరుగా పని చేస్తున్న కందుకూరి వీరేశలింగం (1845 - 1919), 1876 లో రాజమండ్రికి బదిలీ అయారు. వితంతువులకు ఆశ్రయం, స్త్రీవిద్య, సారస్వత సేవ, సంఘ సంస్కరణ — ఈ నాలుగూ ఆయన జీవితానికి మూల స్తంభాలు, శ్రుతి స్మృతి పురాణాదుల ప్రమాణంతో సనాతన పండితులను వొప్పించి, 1881 లో రెండు వితంతు వివాహాలు జరిపించి, ఆనాటి ముప్ఫయివేలు తన స్వంతసొమ్ముతో, 'వితంతు శరణాలయం' రాజమండ్రి లో స్థాపించారు. స్త్రీ, పురుషునితో బాటు, విద్యావంతురాలు కావాలన్నారు .... 'రాజశేఖర చరిత్ర' (వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్), 'సత్యరాజా పూర్వాదేశయాత్రలు' (గలివర్స్ ట్రావెల్స్), 'విక్టోరియా మహారాణి చరిత్రము' 'జీసస్ చరిత్రము', 1910 నాటి' 'స్వీయచరిత్ర' - యివి వచన రచనలు. సంస్కరణాభిలాషతో వ్రాసినవే ప్రహసనాలన్నీ! ఇక, అభిజ్ఞాన శాకుంతలము, వెనీసు వర్తకోదంతము ప్రహ్లాద, దక్షిణ గోగ్రహణము వంటి నాటకాల మాట అటుంచి, 'కవుల చరిత్ర' ఆయన ఆంధ్ర సరస్వతికి సమర్పించిన దివ్యపారిజాతం. సామాజిక సాహిత్య రంగాలలో తెలుగు జాతిని మేల్కొల్పిన మహనీయుడూ విద్వన్మణి.... ముఖపత్ర చిత్రం ; వడ్లమాని మధుసూదనరావు సౌజన్యంతో.

యాడమ్స్. తన ముందు ఎన్నో సమస్యలు వున్నప్పటికీ దేశభవితవ్యమెంతో ఆశాజనకంగా కనిపించింది. తనూ, తన మిత్రులు ఒక ప్రఖ్యాత చారిత్రక రంగస్థలంపై రసవంతమైన ఘటాన్ని నిర్వహిస్తున్నట్లుగా తోచింది.

జులై రెండవ తేదీ సాయంత్రము విప్లవ చరిత్రను, నూతన పంథాలో తీర్చి దిద్దుతున్న శిల్పి జాన్‌యాడమ్స్ తన భార్యకు ఆశాసూచకమగు వార్త తెలియబరుస్తూ ఇలా వ్రాశాడు: "1776 జులై రెండవతేదీన, భగవత్ కృపవలన మనము విమోచన దినముగా భావించవలసివుంది. ముందు తరాల వారు దీనిని ఆ విధముగానే జ్ఞాపకం పెట్టుకుంటారు. ఈ స్వాతంత్ర్య ప్రకటనను కాపాడుకునేందుకు, ఈ రాష్ట్రాలని రక్షించుకొని స్వయంపోషకము చేసుకునేందుకు, ఎంతటి పరిశ్రమ, రక్త తర్పణము, సాధన సంపద కావాలో నాకు తెలుసు. సత్ఫలితము కోసము కష్టపడక తప్పదు. భావిపౌరులు ఈరోజును పర్వదినముగా జ్ఞాపకము పెట్టుకుంటారు". జులై రెండవ తేదీన జాన్ యాడమ్స్, స్వాతంత్ర్య నిశ్చయమైపోయాక, ఇక మిగిలేది యుద్ధమేనని అనుకున్నాడు. ఈ స్వాతంత్ర్య ప్రకటన యుద్ధభూమిలో విజయంవల్ల బలపడితే తప్ప, తమ తిరుగుబాటు దారుణంగా అణచి వేయబడుతుందని అతనికి తెలుసు.

మూడు వైపులనుంచి దాడి, జరిపేందుకు సిద్ధంగా వున్నాయి ఆంగ్ల సేనలు ఉత్తరాన కెనడా మార్గము తెరువబడివుంది. ఆయుధ సంపదలేని కారణంగా ఆవలసని పోగొట్టుకున్నారు విప్లవకారులు. హడ్సన్ నదీ లోయ గుండా బెనడిక్ట్ ఆర్నాల్డ్ సేనలు, చాంప్లెయిన్, సరస్సు వెనుకకు దీనంగా మళ్లుతున్నాయి. తూర్పున జనరల్ వాషింగ్టన్ న్యూయార్క్ రేవులోని శత్రు నౌకాదళాలను ఎదుర్కొనవలసి వున్నది. దక్షిణాన ముఖ్యరేవు పట్టణమైన ఛార్లెస్‌టన్‌ని, సర్‌పీపార్కర్ తన యుద్ధ నౌకలతో ఎదుర్కొంటున్నాడు. ఈ మూడు వైపుల నుంచీ ఒకేసారి దాడి జరిపి వుత్తర దక్షిణాలనీ, న్యూ ఇంగ్లండునీ మధ్య వలసలనీ చీల దీయాలని చూస్తున్నారు. వాషింగ్టన్ సేనలు వోడిపోయి మిగతా దేశము చీలిపోతే, వలసలని కాళ్ళ బేరానికి తీసుకురావచ్చు.

1776 జులై రెండవ తేదీన క్రౌన్ పాయింట్ వద్ద బెనడిక్ట్ ఆర్నాల్డ్ మొండిసాహసంతో, దెబ్బతిన్న నౌకలను మరమ్మత్తు చేయిస్తున్నాడు. అక్కడకు అరవై మైళ్ళ దూరాన బర్గానీ, కార్లటన్ సేనానులు సుమారు 12 వేల సేనను ముందుకు నడిపించుకుంటూ వస్తున్నారు. హడ్సన్ లోయ గుండా ప్రయాణముచేసి 'హవ్'ని న్యూయార్క్‌లో కలుసుకోవాలని బర్గానీ ప్రయత్నము. (ఇంకా వుంది



—మాతృక : కార్నెల్ వెన్‌గ్వెల్

—తెలుగు : యన్నార్ చందూర్